# ఆంధ్రపత్రిక.



316841

The Andhra Patrika, Madras. } Regd No. 1118 Vol 34 No 59 MONDAY 9th JUNE 1947 వెల ఒకఅణా ! Founder: K. Nageswara Rao

# "కార్యవర్గ నిర్ణయాన్ని ఆమోదించి తీరవలసిందే"

## అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి గాంధి మహాత్ముని సలహా

### తానే లీగు అధ్యక్షుడైతే పాకిస్థాన్ను ప్రజలందర్నీ ఆకర్షించేటట్లు చేస్తానని ప్రకటన

న్యూఢిల్లీ, జూన్ 7: "సార్వభౌముని ప్రభుత్వమువారు జూన్ 3 వ తేదీన చేసిన ప్రకటనను కాంగ్రెసు వర్కింగు కమిటీవారు అంగీకరించినారు. ఈ విధముగా కాంగ్రెసువారు అంగీకరించిన నిర్ణయాన్ని అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు తిరస్కరించవచ్చును." అని గాంధిజీ ఈ రోజు సాయంత్రము ప్రార్థన సమావేశములో ఉపన్యసిస్తూ చెప్పినాడు.

"అయితే ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు వర్కింగుకమిటీవారి నిర్ణయాన్ని ఏ. ఐ. సి. సి. వారు అంగీకరించి ఇకముందు తమ వ్యవహారాలకు ఒక క్రొత్తవర్కింగు కమిటీవారికిన్నీ ఒక క్రొత్త అధ్యక్షునికిన్నీ ఒప్పచెప్పవలెనని నేను అనుకొంటున్నాను." అని మహాత్ముడు సూచించినాడు.

"కాంగ్రెసు ముస్లిములీగుకు ప్రతినిధిగా పనిచేయక పోవచ్చును. కాని ప్రతి భారతీయుని హక్కులను ఇంకా కాపాడవలసిన అవసరమున్నది. ముస్లిములు అందరున్నూ లీగుతో చేరిపోయినారనీ కాంగ్రెసు..."

"సార్వభౌముని ప్రభుత్వ పథకాన్ని అంగీకరించడము నాకు యిష్టములేదు. అయితే అనేక సందర్భాలలో మనకు యిష్టము..."

(2 వ పేజీ చూడుడు)

## శాంతి స్వాతంత్ర్య సౌభాగ్యాల నెలకొల్పడానికి అమెరికా చేసే ప్రయత్నానికి భారతదేశ తోడ్పాటు

### భారత రాయబారి అసఫ్ ఆలీ వాగ్దానం

వాషింగ్టన్, జూన్ 7: "ప్రపంచంలో శాంతి స్వాతంత్ర్య సౌభాగ్యాలను నెలకొల్పడానికి అమెరికా చేసే ప్రతి ప్రయత్నంలోనూ భారత దేశం సర్వశక్తులా సహకరిస్తుంద"ని, అమెరికాలో భారత రాయబారిగా ఉంటున్న అసఫ్ ఆలీగారు నేడు రేడియోలో ఉపన్యసిస్తూ స్వదేశం తరఫున అమెరికాకు వాగ్దానం చేశారు.

"ప్రపంచ సమస్యలు సక్రమంగా పరిష్కారంకావాలని కాంక్షించే శాంతికాముకులైన ప్రజలందరూ, నేటి ఈ యుద్ధానంతర యుగంలో అమెరికా యావత్ ప్రపంచానికి..."

(2 వ పేజీ చూడుడు)

## భారతదేశ విభజనము

### సెక్యూరిటి కవున్సిల్లో తీర్మానము

## "సింధురాష్ట్రంలోని హిందూ ప్రాంతాలను వేరు చేయాలి"

### బ్రిటిష్ పథకంపై అఖిల భారత హిందూ మహాసభ వర్గాల చర్చలు

## కాంగ్రెసు పాకిస్తాన్కు అంగీకరించకూడదు

### వీర సావర్కార్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, జూన్ 7: అ. భా. హిందూమహాసభాధ్యక్షులైన ఎల్. బి. భోపట్కార్ గారికి వీర సావర్కార్ గారు ఈ తంతివార్త పంపాడు:—

## భారతదేశ భవిష్యద్రాజ్యాంగం గురించి పరిషత్తుడపసంఘాల చర్చలు

### బలీయమైన ఫెడరల్ ప్రభుత్వాన్ని స్థాపించుటకు నిర్ణయం

## అధికారాన్ని అప్పగింత పెట్టడానికి భారతదేశానికి లార్డ్ లిస్టోవెల్ రావచ్చును

లండన్, జూన్ 8: తన చేతులమీదుగా అధికారాన్ని భారతీయులకు అప్పగింత పెట్టడానికిగాను ఇండియా కార్యదర్శి లార్డ్ లిస్టోవెల్ భారత దేశం పోవచ్చునని అమెరికన్ యునైటెడ్ ప్రెస్ విలేఖరి వ్రాస్తున్నాడు.

## సంస్థానాలు భారతయూనియన్లో చేరాలని డాక్టరు పట్టాభి హెచ్చరిక

### కథియవార్ సంస్థాన ప్రజామండలి వార్షికసభలో అధ్యక్షప్రసంగం

బొంబాయి, జూన్ 7: కథియవాడ్ సంస్థానప్రజ మహాసభకు అధ్యక్షునుగా ఎన్నుకోబడిన డా॥ పట్టాభి సీతారామయ్యగారు న్యూఢిల్లీనుంచి నేడిక్కడికి విమానంమీద వచ్చారు. విమానాశ్రయం వద్ద స్వాగత సంఘాధ్యక్షులైన శామళ్దాస్ గాంధీగారునూ, ప్రముఖకాంగ్రెసు నాయకులును పట్టాభిగారికి స్వాగతమిచ్చారు. డా॥ పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతన కథియవాడ్ ప్రజామహాసభ సమావేశం నేటి సాయంత్రం ఇక్కడ ప్రారంభమైంది. సమావేశం రెండురోజులపాటు జరుగుతుంది. బొంబాయి హోంశాఖా మంత్రి అయిన మొరార్జీ దేశాయ్ గారునూ, ఇతర మంత్రులునూ, రాష్ట్రకాంగ్రెసు కమిటీ అధ్యక్షులైన ఎస్. కె. పాటిల్ గారునూ ఇంకా అనేకమంది ప్రముఖులు సమావేశానికి హాజరైనారు. డా॥ పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షోపన్యాసం చేస్తూ ఇలా అన్నారు: మన మిప్పుడు 1947 లో ఉన్నాము; నరేంద్రులు ప్రజేచ్ఛకు పూర్తిగా లొంగిపోవలసినయుగం వచ్చినది.

హైదరాబాదు, భోపాలు, నవనగరు మున్నగు సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వాలు నెలకొల్పవలెనని ఆందోళన చేయడంఇప్పుడువెనకటంత అవసరంరాదు; భారత సమితిలో ఈసంస్థానాలన్నీ త్వరితంగా చేరిపోవలెనన్నదే ఇప్పుడు అన్నిటికంటెను ప్రధానమైన విషయం. మిగతా అన్ని విషయాలు విడిచిపెట్టి రాజ్యాంగ పరిషత్తులో ఆయా సంస్థానాలు ప్రవేశం...

అభిమతం నెరవేర్చుకోడానికి కావలసినన్ని వీలున్నప్పుడు సంస్థానాధిపతుల ఇచ్చవచ్చిన పద్ధతినే ప్రజలు ఎందుకు నడుచుకోవాలో బోధపడడంలేదు."

## సంస్థానాలు_రాజ్యాంగ పరిషత్తు

### కార్యదర్శి కార్యాలయం ప్రకటన

న్యూఢిల్లీ, జూన్ 7: రాజ్యాంగపరిషత్తు కార్యదర్శి కార్యాలయంవారు ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు:

"రాజ్యాంగపరిషత్తు, నరేంద్రమండలి రాయబార ఉపసంఘముల జాయింటుసమావేశంలో ఇటీవల చాలా ప్రధానమైన నిర్ణ..."

## డక్కనుసంస్థానాలకూటమికి ఆనెగారు పరిషత్ ప్రతినిధి

పూనా, జూన్ 7: రాజ్యాంగ పరిషత్తులో సంస్థానవర్గం తరఫున ప్రతినిధిగా వ్యవహరించవలసిందని ఎమ్. ఎస్. ఆనే...

(3 వ పేజీ చూడుడు)

# ఆర్థిక, వ్యాపార విషయాలు

## స్టెర్లింగ్ నిలవల పరిష్కారం

### బ్రిటిష్ వైఖరి పరిశీలన

లండను, జూన్ 7: స్టెర్లింగ్ బాకీ పరిష్కార ప్రసంగాల ప్రారంభోత్సవంలో ఏర్పడిన ఒడంబడికల్ల జులై 15 అనంతరం బ్రిటను ఇవ్వవలసిన స్టెర్లింగులను స్వేచ్ఛగా ఇతర నాణ్యాలలోకి మార్చుకునే అవకాశం భారతదేశానికి ఉండిపోయినందనే భయానికిగాని సందేహానికిగాని ఏమీ ఆస్కారంలేదని బ్రిటిషు ఆర్థికవర్గాల అభిప్రాయం. ఇది కేవలంఏదో లాంఛనమైన సంబంధించినదనీ, ఇండియన్ రిజర్వుబ్యాంకునకు, బ్యాంకుఆఫ్ ఇంగ్లండుకూ సంబంధించినదనీ, ఈ రెండుబ్యాంకుల ప్రతినిధులు కేబిల్ ద్వారాగాని, టెలిఫోనుపైనగాని మాట్లాడుకొని ఈ మారకపు కంట్రోలు విషయంలో ఒక సమాధానానికి వస్తే జులై 15 తరువాత ఇబ్బందేమీ ఉండదనీ ఇక్కడ అంటున్నారు. అయితే ఒక చిక్కు మాత్రం ఉంది. భారతదేశానికి కిన్న విదేశ ద్రవ్యం అంతా బ్రిటను ఇవ్వవలసిన స్టెర్లింగుబాకీయే. దీన్ని జులై 15 తరువాత స్వేచ్ఛగా ఇతర ద్రవ్యాల్లోకి మార్చడానికి వీలుండదు. కనుక బ్రిటను తనకై తాను గాని భారతదేశంతో సంప్రతించిగాని కొంతమొత్తాన్ని విడుదలచేయవలసి ఉంటుంది. విడుదల చేయడంగురించి అనుమానంలేదుగాని ఈ మొత్తం ఎంత అనే విషయంలో కొంత అనుమానం ఉంది. మాసానికి 10 లక్షలుగాని 15 లక్షలుగాని విడుదల చేయడానికి బ్రిటను సమ్మతింపవచ్చునని అనుకుంటున్నారు. అయితే ఇది చాలదని భారతదేశం తిరస్కరించి అధమం 10 కోట్ల పౌనులైనా విడుదల కావాలని కోరవచ్చు.

## ఆంగ్లో-ఈజిప్షియన్ స్టర్లింగు బాకీసంప్రదింపులు

లండన్, జూన్ 6: ఆంగ్లో - ఈజిప్షియన్ స్టర్లింగు నిల్వల విషయమై జరుగుతున్న సంప్రదింపులలో ఒక పెద్ద ప్రతిబంధకం ఏర్పడింది. ఈజిప్టుకురాల్సిన యీ స్టర్లింగు నిల్వలు, ఈజిప్టుప్రభుత్వం చేతుల్లోగాని, లేక యీజిప్టు నేషనల్ బ్యాంకు చేతుల్లోగాని పూర్తిగా కేంద్రీకృతమైలేవు.

ప్రైవేటు వ్యక్తులచేతుల్లో యీనిల్వలు అధికంగా కేంద్రీకరించబడి ఉన్నాయి. అందుచేత తన స్టర్లింగు నిల్వల సమస్యను పరిష్కరించుకోడానికి ఈజిప్టుకు రెండే రెండుమార్గాలున్నట్లు కన్పిస్తోంది. మొదటిది: ఈజిప్షియన్ ద్రవ్యవిధానంలో, యీ ప్రైవేటు వ్యక్తులకు రావల్సిన స్టర్లింగు బాకీని చెల్లించి, తద్వారా స్టర్లింగు నిల్వలను ఒకేచోట కేంద్రీకరించడం, రెండవది: స్టర్లింగును అత్యవసరము అలభ్యము (హార్డ్ కరెన్సీ) అయిన ద్రవ్యంగా మార్చి, ఈజిప్షియన్ల స్టర్లింగు వినియోగంపై రాజీప్షియన్ ప్రభుత్వం కంట్రోలు పెట్టడం.

## అంతర్జాతీయ వాణిజ్యమండలి సభ

మాంట్రో, జూన్ 7: ప్రపంచవాణిజ్యసంఘానికి తమ హృదయపూర్వక సహాయ సహకారాలను లభింపచేస్తామని ఐక్యజాతి సమితికి హామీ ఇస్తూ అంతర్జాతీయ వాణిజ్యమండలి ఏకాదశ వార్షిక సభ తీర్మానించింది. కొత్త అంతర్జాతీయ సంఘాన్ని నియమించడం చాలదనీ, ఆ సంస్థ సభ్యులు సంస్థ ఆదర్శాలను, తీర్మానాలను ఎంతవరకు పాటిస్తారో చూడాలనీ, అదే ప్రధాన విషయం అనీ కూడా ఆతీర్మానంలో ఈసభవారు సూచించారు.

## బొంబాయి స్టాక్ ఎక్స్చేంజి

శనివారం బొంబాయి స్టాక్ ఎక్స్చేంజి మూసివేయబడింది.

## భారతదేశానికిస్వీడన్‌సామగ్రి

న్యూఢిల్లీ, జూన్ 7: భారత దేశానికి ఎగుమతి చేయడానికి కీలైన లేకయంత్రాలను గురించి స్వీడిష్ ఎగుమతి సంఘం ఒక విచారణ జరిపినట్లు లండన్‌లోని ఇండియా సప్లయి కమీషన్ తెలియజేస్తున్నది. ఈ విచారణఫలితంగా స్వీడన్ భారతదేశానికి పరిమితంగా ఈ క్రింది యంత్రసామాగ్రిని సప్లయి చేయగలుగుతుందని తేలింది: ఉక్కు, ఇనుము సామాగ్రి, మోటారు పరిశ్రమకు యంత్రాలు, కాగితం, పెన్సిళ్లు తయారుచేసే యంత్ర సామాగ్రి, పుగాకు సైపులను తయారుచేసే యంత్రాలు, కొన్ని సామానులను 18 నూ సాల్లో సప్లయి చేయ వీలుంది. కాని పూర్తిగా సప్లయి చేయడం 1952 లో పున సాధ్యం గాదనీ కూడా స్పష్టమౌతున్నది.

## బ్రిటిష్ వాణిజ్య విధానంలో మార్పు

### యూరప్ రాజ్యాలతో సన్నిహిత సంబంధాలు

లండన్, జూన్ 7: అమెరికాతో కంటే యూరపు రాజ్యాలతోనే ఎక్కువ వ్యాపారం చేయడానికి బ్రిటన్ ఏర్పాట్లు చేసుకుంటున్నట్లు ప్రభుత్వ ఉన్నతోద్యోగి ఒకరు అమెరికన్ అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరికి చెప్పారు. బ్రిటన్ డాలరు సంపద నానాటికీ దిగజారుతూ ఉన్నదనీ, మిగిలిన డాలరులనైనా కాపాడుకుందాం అనే ఉద్దేశంతో బ్రిటన్ ఈ విధానాన్ని అనుసరిస్తున్నదనీ ఈ అధికారి అన్నాడు. బ్రిటిష్ వ్యాపార విధానం మార్పుకు మరో కారణం కూడా ఉన్నట్లు కన్పిస్తుంది. ప్రస్తుత ఏర్పాట్ల ననుసరించి బ్రిటన్ ఎక్కువగా అమెరికాపైనే ఆధారపడవలసివస్తున్నది. అంచేత అమెరికాలో ఆర్థిక మాంద్యం ఏర్పడితే బ్రిటన్‌లోనూ ఆర్థికమాంద్యం తప్పదని బ్రిటిష్ అధికారుల భయం.

అంతేగాదు, అమెరికా యూరపియన్ రాజ్యాలకు ఎక్కువగా ఆర్థిక సహాయం చేయడంవల్ల ఆయాదేశాలు ఆ డాలర్లతో బ్రిటన్‌నుండి ఎక్కువగా కొనుక్కోవడానికి వీలుంటుంది. ఈ విధంగా బ్రిటన్ తన డాలరు సంపదను వృద్ధిచేసుకోవడానికి వీలవుతుంది. బ్రిటిష్ వ్యాపార విధానంలో వచ్చిన ఈ మార్పువల్ల ప్రస్తుతం బ్రిటన్‌కూ యూరపులోని కమ్యూనిస్టు రాజ్యాలకూ ఉన్న భేదాలను తొలగించడం కూడా సాధ్యమవుతుంది. వ్యాపార రంగంలో సన్నిహిత సంబంధాలున్న దేశాలు అంతర్జాతీయ రాజకీయ రంగంలోకూడా సన్నిహితంగా ఉంటవని, అంచేత బ్రిటన్ తన వాణిజ్య విధానాన్ని చాలా జాగ్రత్తగా నిర్ణయించుకోవలసి ఉంటుందనీ ఈ బ్రిటిష్ అధికారి అన్నాడు. అమెరికా ఇచ్చిన ఋణద్రవ్యం దాదాపు నిండుకోవచ్చింది. అందువల్ల బ్రిటన్ ఆ దేశంనుండి తెప్పించుకునే సామాగ్రిని పూర్తిగా తగ్గించుకోవడానికి బ్రిటిష్ మంత్రివర్గం నిశ్చయించుకొన్నది. అమెరికాతో ఈ వ్యాపార లావాదేవీలను తగ్గించుకోవడంవల్ల, రష్యా బ్రిటన్‌కు కావాల్సిన ఆహారపదార్థాలను సప్లయిచేస్తుందని బ్రిటిష్ మంత్రివర్గం అభిప్రాయపడుతున్నది.

## డా॥ మత్తాయ్ కార్యక్రమం

న్యూఢిల్లీ, జూన్ 7: భారత ప్రభుత్వ రవాణాశాఖ సభ్యుడు డా॥ జాన్ మత్తాయ్ 9 తే బొంబాయి వెళుతున్నారు. అక్కడ ఆయన అధ్యక్షతను రెండు ముఖ్య సమావేశాలు జరుగనున్నవి: మద్రాసుకూ కొచిన్‌కూ మధ్య ఒక పెద్ద నాకా సేవను ఏర్పాటుచేయడం గురించి ఆలోచించడానికి ఒక సమావేశమూ, వస్తువుల రవాణా శీఘ్రంగా జరగడానికీ, నైన్య ప్రయాణికుల ప్రాణాలు, ప్రయాణం చేసే కాలంలో సురక్షితంగా కాపాడేందుకు తీసుకోవలసిన చర్యల గురించీ విచారించడానికి మరో సమావేశము జరుగుతుంది.

## మోటారు కారుల బాటరీ పరిశ్రమ

ఉదకమండలం, జూన్ 7: మోటారు కారు బాటరీల తయారుచేసే వారికి ఎలాంటి సహాయం ఏమిరక్షణ కావాలో తెలుపవలసిందనీ ఈ వివరాలను 12 ప్రతులుగా జూన్ 25 వ తేదీలోగా తమకు అందేట్లు పంపవలసిందనీ ఇండియన్ టారిఫ్‌బోర్డువారు బాటరీలను తయారుచేసే వారందర్ని కోరుతూ ఒక ప్రకటన చేశారు.

## లాహోరు లాయరుకు బాకు పోటు

లాహోరు, జూన్ 7: ఈ రోజు ఉదయము ఒక ప్రముఖమైన లాయరు ఒక మేజస్ట్రేటుతో సహా షికారు వెళుతూ ఉండగా ఎవరో ఒకరు సైకిలు మీద వెళుతూ లాయరును బాకుతో పొడిచినాడు. లాయరు వెంటఉన్న మేజస్ట్రేటు ఆసైకిల్ మీద వెళుతున్న వాణ్ణి కర్రతో కొట్టినాడు. కాని సైకిల్‌మీద వెళుతూ ఉన్నవాడు బాకును అక్కడే పారవేసి తప్పించుకొని పారిపోయినాడు. గాయము అయిన లాయరును ఆసుపత్రికి చేర్చినారు. ప్రమాదములేదని తెలుస్తూ ఉంది.

వార్తా పత్రికలకు టెలిగ్రాములు అందచేసే ఇంగ్లాండు పీఠంలో పట్టుకొని కొట్టినారు.

---

గుడివాడ, జూన్ 3: ఈయనపుగంటి సత్యనారాయణగారి అధ్యక్షతను శ్రీనివాస సినిమాహాలులో కృష్ణాజిల్లా అత్యవసర రైతుమహాసభ సమావేశమైంది. రైతులనుండి ధాన్యమును నిర్బంధంగా సేకరించుటను గర్హిస్తూ తీర్మానమును చేసెను.

## ద. ఆఫ్రికా భారతీయుల సమస్య

### పరిష్కరించవలసిందని రాజప్రతినిధికి విజ్ఞప్తి

లండన్, జూన్ 6: ఇండియన్ నేషనల్ ఓవర్సీస్ కాంగ్రెసు అధ్యక్షుడైన సి. డి. నాగీగారు గాంధీజీకి రాజప్రతినిధి మైకౌంట్ మౌంట్‌బాటెన్‌కూ స్టేట్ కార్యదర్శి లార్డ్ లిస్టొవెల్, పండిట్ నెహ్రూ మున్నగువారికు ద. ఆఫ్రికాలోని భారతీయుల సమస్యగురించి ఓ టోక ఉత్తరం వ్రాశారు; ఆ ఉత్తరంలో ఇలా ఉన్నది: "శాంతముగా ఇప్పుడు భారతదేశసమస్య పరిష్కారమైంది గనుక అదే ఉదార దృక్పథంతో ద. ఆఫ్రికా భారతీయుల సమస్యకూడా వెన్వెంటనే పరిష్కరించదగియున్నది. లార్డ్ మౌంట్‌బాటెన్ భారతదేశంలోని వివిధ పార్టీలను ఒకసమాధానమార్గానికి తీసుకొని రాగలిగాడు. ఇదే చాకచక్యంతో దక్షిణ ఆఫ్రికా సమస్యను ఆయన పరిష్కరించగలిగినట్లయితే, భారతదేశ రాజప్రతినిధులలోకల్లా ఉత్కృష్టకీర్తి ఆయనకు శాశ్వతంగా లభించకలదు. దక్షిణఆఫ్రికాలో ఇప్పుడు కార్యాచరణకు తరుణం వచ్చింది ఇది ఏమాత్రం జాగుచేసినా అవకాశం జారిపోతుంది. కాలహరణంచేసిన కొద్దీ సమస్యా పరిష్కారం కష్టసాధ్యమౌతుంది."

## రాయచేడులో పోలీసు కాల్పులు

హైదరాబాదు, జూను 6: రాయచేడు నైజాంసంస్థానంలోని జాగీరుగ్రామము ఆ గ్రామంలోని హిందువులు అక్కడ ఆర్యసమాజమును స్థాపించుకొనగోరి జోగిపేట ఆర్యసమాజమంత్రి దగ్గరకుపెళ్లి తిరిగి స్వగ్రామమునకురాగా, గ్రామద్వారమువద్ద వారిని పోలీసులు ఆపి తుపాకులు పేల్చినని వార్తవచ్చినది. గ్రామములోపల హిందువుల యిండ్లు దోచుకొనబడెననియు పైచెప్పిన తుపాకి కాల్పులవల్ల 9 మందిగాయం దోపిడీల సందర్భములో ఇండ్లకు నిప్పంటించుటవల్ల 4 గురు పురుషులు ఒక స్త్రీ మరణించిరనియు తెలియుచున్నది. ఈ సంఘటనలు మే 28 తేదీన జరిగెను. హైదరాబాదుస్టేటు కాంగ్రెసు జనరలు కార్యదర్శియైన శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు మే 28 తేదీన రాయచేడు గ్రామమునకు వెళ్లిచూచి ఇలా వ్రాయుచున్నారు: ముస్లిములు నివసించే భాగము తప్ప మిగిలినదంతయు స్మశానమువలె నున్నది. హిందువులు గ్రామంలోనికి తిరిగి వచ్చుటకు సాహసించుటలేదు. రెండంతస్తుల మేడలు మండుకొని పూరిగుడిసెలవరకు నిప్పంటించబడెను. యిండ్లను లూటీచేస్తూ ఉంటే పోలీసులు చూస్తూ ఊరకున్నారు. గ్రామములోపల 5 గురు గ్రామస్థులు పశువులవలె వధింపబడిరి. అందులో ఒక స్త్రీకూడ కలదు. స్టేటుకాంగ్రెసు కార్యకారిణీ సమితికి పూర్తి వివరములతో కూడిన నివేదిక సమర్పింపబడెను.

## స్థానికసంస్థలఎన్నికలు

### అభ్యర్థులకు ప్రభుత్వ సూచన

చెన్నపురి, జూన్ 8: జిల్లాబోర్డులు, మునిసిపల్ కౌన్సిల్ల ఎన్నికలలో పాల్గొను అభ్యర్థులు ఈ క్రిందిపార్టీ ప్రముఖులనుండి సర్టిఫికెట్లను పొందవలెనని మద్రాసుప్రభుత్వం ప్రకటించింది. కాంగ్రెసుపార్టీ అభ్యర్థులను గురించి ప్రభుత్వం డిసెంబరు 18, ఫిబ్రవరి 12 తేదీలలో ప్రకటించింది.

ముస్లింలీగ్ పార్టీ — మద్రాసు ముస్లింలీగ్ ప్రావిన్షియల్ పార్లమెంటరీబోర్డు సెక్రటరి, 33, ఎర్రబాలుచెట్టి వీధి, జార్జిటౌన్, మద్రాసు.

కమ్యూనిస్టు పార్టీ — తెలుగు జిల్లాలు— కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థుల పేర్లను ప్రకటించిన "ప్రజాశక్తి" దినపత్రికా ప్రతి.

ఆంధ్ర స్వరాజ్యపార్టీ — పార్టీ ప్రెసిడెంటు, గోష్టి, బెజవాడ.

జేమనలిస్టు ముస్లిం మజ్లిస్ — మద్రాసు ప్రావిన్షియల్ జేమనలిస్టు ముస్లింమజ్లిస్ ప్రెసిడెంటు, 4, అప్పుమొదలి వీధి, మైలాపూరు, మద్రాసు.

హిందూ మహాసభ — రాష్ట్ర హిందూ మహాసభకార్యదర్శి, కె. శివనందదేవర, 7, మేలపట్టణంల్ స్ట్రీట్, మధుర.

రాడికల్ డెమోక్రటిక్‌పార్టీ — మెడ్రాస్ ప్రెసిడెన్సీ ఫెడరేషన్ల కార్యం ఎవరివద్ద సర్టిఫికెట్లు పుచ్చుకోవలసిందీ ఎలక్షన్ ఆఫీసర్లు నిర్ణయించెదరు.

## సిక్కుల సమావేశము

లాహోరు, జూన్ 7: బ్రిటిషు పథకమువల్ల ఏర్పడే పరిస్థితులను చర్చించేటందుకు సిక్కు పంథిక్ ప్రతినిధి సంఘం వారు పంజాబు ఎసెంబ్లీలో సిక్కు సభ్యులున్నూ జూన్ 9 వ తేదీన సమావేశము అవుతారు. ఆరోజునే శిరోమణి అకాలీదళము వారి వర్కింగుకమిటీ వారున్నూ సమావేశము అవుతారు.

## అసఫ్ ఆలీ వాగ్దానం

(1-వ పేజీ తరువాయి)

ఎలా ఉన్నప్పటికీ, భారతదేశం ప్రపంచమందు శాంతి స్వాతంత్ర్య సౌభాగ్యస్థాపనా ప్రయత్నంలో తన హృదయపూర్వకంగా తోడ్పడుతుందని అమెరికా నిస్సందేహంగా విశ్వసించవచ్చును."

ప్రపంచశాంతికి భంగం కలిగించగల ప్రమాదహేతువులలో అన్నిటికంటె ప్రధానమైనది ఏది అన్న ప్రశ్నకు అసఫాలీ ఇలా సమాధానం ఇచ్చారు:— "చేతి కందిందల్లా జేబులో వేసుకోవాలన్న దుర్బుద్ధి శక్తివంతులకు ఎప్పుడు పుడుతుందో అప్పుడే ప్రపంచశాంతికి ప్రమాదం ఏర్పడినట్లు భావించవచ్చును. మానవస్వాభావికమైన ఈ దురాశయే ప్రపంచశాంతి విపత్కరమైన విషయాలలోకెల్లా ప్రధానమైనదని నా అభిప్రాయం. మానవజాతియొక్క అంతఃకరణ జాగృతమై మిత్రరాజ్య సమితిద్వారా తన ప్రభావాన్ని ప్రపంచముమీదికి ప్రసరింప చేయగలిగినట్లయితే, మనుష్య ప్రకృతిలో నిగూఢమైయున్న ఈ తామసిక శక్తిని ఈ దురాశను నేర మిారనివ్వకుండా అదుపాజ్ఞలలో పట్టి ఉంచడానికి వీలవుతుంది. యుద్ధానంతరం ప్రపంచంలో అమెరికా, రష్యాలు అత్యంత ప్రధానమైన భూమికను వహించగలవని భారతదేశం అభిప్రాయపడుతోంది. ఈ ఉభయదేశాలు తమ అన్యోన్య సంబంధాలను ఏ ప్రాతిపదిక మీద ఏ రీతిగా ఏర్పాటు చేసుకుంటవి, మిత్రరాజ్యసమితియొక్క అభిప్రాయ నిర్ణయాలను ఇవి ఎంతవరకు శిరసావహిస్తవి అన్న విషయం మీదనే ప్రపంచముయొక్క భవిష్యత్తు చాలవరకు ఆధారపడి ఉన్నది.

భారతదేశం మిత్రరాజ్య సమితితో సర్వవిధాలా సంపూర్ణంగా సహకరించడానికి కృతనిశ్చయమై యున్నది. అయితే మిత్రరాజ్య సమితి ప్రపంచంలో శాంతి భద్రతల రక్షణకు అవసరమైన సైనికాధికారాన్ని, ప్రాబల్యాన్ని ఇంకనూ సమకూర్చుకోవలసి యున్నది.

"ఐక్య ప్రపంచ"నిర్మాణానికి ఆసియాఖండం చేయగల ప్రధాన సహాయం ఏమిటి అన్న ప్రశ్నకు అసఫాలీ ఇలా సమాధానం చెప్పాడు:—"ఈ విషయంలో ఆసియా చేయగల సహాయం ఎదుటివారి స్వీకరణ శక్తిమీద ఆధారపడి ఉంటుంది. ఆసియాఖండం ఆధ్యాత్మిక, ఐహిక, అభ్యుదయ వస్తువులకు పుట్టినిల్లు. ప్రపంచముయొక్క సహజ సంపదలనూ, నైతికశక్తులనూ సకల మానవకోటికీ ఉపకరించే విధంగా సమన్వయించి వినియోగించుకోడం ఎలాగో నేర్పడంకన్న, ఆసియాఖండం ప్రపంచానికి చేయగల శ్రేష్ఠమైన సహాయం ఇంకొకటి లేదని నా ఉద్దేశ్యం."

## గాంధిజీ సలహా

(1-వ పేజీ తరువాయి)

లేని విషయాలను సహించడమూ అంగీకరించడమూ చేయవలసి వస్తూ ఉంటుంది.

"ప్రభుత్వపథకాన్ని అంగీకరించే విషయములో నాకున్నూ వర్కింగ్ కమిటీ వారికిన్నీ అభిప్రాయభేదము వచ్చిందనీ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారి నిర్ణయాన్ని ఏ. ఐ. సి. సి. వారు తిరస్కరిస్తారనిన్నీ పత్రికలలో ప్రకటనము అయింది. అయితే ఏ. ఐ. సి. సి. వారే వర్కింగు కమిటీని నియమించినారు. అందువల్ల వర్కింగు కమిటీవారి నిర్ణయాలను సులభముగా తోసివేయడానికి వీలులేదు. వర్కింగు కమిటీవారు ఏ. ఐ. సి. సి. వారి తరఫున ఒక ప్రామిసరీనోటుమీద దస్కతు చేస్తే ఏ. ఐ. సి. సి. వారు దానిని గౌరవించవలసే ఉంటుంది. వర్కింగు కమిటీవారు తప్పుచేయవచ్చును. అయితే వారిని తొలగించడమే ఆ తప్పుచేసినందుకు శిక్ష అవుతుంది. కాని ఆ చేసిన దానిని కాదనడానికి వీలులేదు.

"బహిరంగముగా ప్రజలను తప్పుదారి తొక్కించడానికి పూనుకొంటేనే కాంగ్రెసుకు ఎదురు తిరగవలసిందని ప్రజలకు నేను చెపుతాను. నా నిగ్రహపద్ధతి అందరికీ తెలుసును. అస్పృశ్యతా విషయములో బ్రహ్మాండమయిన సనాతన హిందు సంఘముమీద పోరాటము సాగించడానికి ప్రచారము చేసినాను. పర్యవసానము మంచే అయింది.

"వర్కింగ్‌కమిటీవారితో నాకుభేదాభిప్రాయము కలిగి ఉండవచ్చును. అయితే ఆ విషయము చెప్పి వారి నిర్ణయాన్ని అంగీకరించవలసిందని నేను సిఫార్సు చేస్తాను. పరిస్థితులను ఇప్పటికిన్నీ చాలా వరకూ చక్కచేయవచ్చునని నా అభిప్రాయము.

"కాంగ్రెసు నాయకులు కాంగ్రెసు జాబితాలలో కనబడే కొద్ది లక్షలమంది సభ్యుల ప్రతినిధులు మాత్రమే కారనీ భారతదేశములో ఉన్న కోట్లకొద్దీ జనుల యోగక్షేమానికోసము పూనుకొని యావన్మంది భారతీయుల హృదయాలనూ చూరగొన్న ప్రతినిధులు అనిన్నీ నేను రెండుమూడు రోజులకిందట కేబినెట్ సమావేశములో చెప్పినాను. ఈ విధముగా కాంగ్రెసు ప్రజలకున్నూ రాజులకున్నూ ప్రతినిధిగా ఉంటూ ఉండి అంగుళం అంగుళం స్వాతంత్ర్యం కోసం పోరాడుతూ అంతరించిపోయిన తరువాత ప్రజల ఇచ్ఛ సార్వభౌమాధికారము అవుతుంది.

"భారతదేశయూనియన్ యున్నూ పాకిస్తాన్ యున్నూ మంచిపనులు చేయడంలో ఒక దానితో ఒకటి పోటీపడాలి. జరుగవలసింది అదే

"పాకిస్తాన్ చక్కగా ఉండేట్లయితే మెజారిటీ మైనారిటీ భేదాలు లేకుండా అందరూ సరిసమానులుగా ఉండేట్లయితే యావద్భారతదేశమున్నూ పాకిస్తాన్ అయిపోతుంది. నేను ముస్లిమ్‌లీగు అధ్యక్షుణ్ణి అయినట్లయితే పాకిస్తాన్‌ను దివ్య సుందరముగా తెరమీదికి ఎక్కిస్తాను. అందరూ ఆకర్షితులు అయ్యేట్లు చేస్తాను. ఆ సందర్భములో నా తప్పును నేను ఒప్పుకొంటాను. పాకిస్తాన్‌ను అందరూ మెచ్చుకొనేట్లు చేస్తాను. ఈ విధముగా కయిదే అజామ్‌జిన్నా చేస్తాడా?"

## మహాత్మునితో నాయకుల సంభాషణ

న్యూఢిల్లీ, జూన్ 7: డా॥ రాజేంద్రప్రసాద్ శ్రీ జి. డి. బిర్లాగారలు నేటి ఉదయము గాంధిమహాత్ముని దర్శించి మాటలాడిరి. ఈ రోజు సాయంత్రము గాంధీమహాత్ముణ్ణి సర్దార్ వల్లభభాయి పటేలున్నూ పండిత జవాహర్‌లాల్ నెహ్రూగారున్నూ కలుసుకొని ఒక అరగంటసేపు మాట్లాడినారు.

## 'బ్రిటిష్ పథకమును నిరాకరింపవలెను'

### ఏ. ఐ. సి. సి. కి శీలభద్ర యాజీ తీర్మానము

పాట్నా, జూన్, 6: 'కట్టకడపటి బ్రిటిషుపథకమును సంపూర్ణముగా నిరాకరింపవలెను, భారతజాతికి చేసిన అవమానమును అసమ్మతి తెలుపుటకుగాను తాత్కాలికప్రభుత్వ కాంగ్రెస్ సభ్యులు తమ సహకారమును వెంటనే ఉపసంహరించుకొనవలెను. బ్రిటిషువారు వెంటనే భారతదేశమునుండి వెళ్లి పోవలెను. తమ జాతీయవాంఛలను అమలుపరుచుటకుగాను భారతప్రజలు అవసరమైన చర్యలు గైకొనవలెను'అని సలహా నిచ్చు తీర్మానము నొకదానిని రాబోవు ఏ. ఐ. సి. సి. సభలో ప్రతిపాదింప పార్వర్డ్‌బ్లాక్ కార్యదర్శి శీలభద్రయాజీగారు నోటీసిచ్చి యున్నారు.

## పురుషోత్తమదాస్ టాండన్ ప్రతిపాదన

అలహాబాద్, జూన్ 7: సంయుక్త రాష్ట్రాల శాసన సభాధ్యక్షుడు పురుషోత్తమదాస్ టాండన్, రాజప్రతినిధి మౌంటుబేటన్ ప్రభువు ప్రతిపాదించిన పథకాన్ని నిరాకరించవలసిందని ఢిల్లీలో జూన్ 14 15 తేదీలలో జరిగే అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో ప్రతిపాదించ దలచుకొన్నట్లు తెలుస్తూవుంది.

## వైస్రాయి కాశ్మీరులో విశ్రాంతి

న్యూఢిల్లీ, జూన్ 7: రాజప్రతినిధి మౌంటుబేటన్ ప్రభువు కాశ్మీరదేశము వెళ్లి కొద్దిరోజులు విశ్రాంతిగా గడపుతాడు. ఇది యీ నెల మూడోవారములో జరుగుతుంది.

## పరిషత్తు ఉపసంఘాల చర్చలు

(1-వ పేజీ తరువాయి)

లేదు. అంచేత ఈ విషయాన్ని రెండు ఉపసంఘాల జాయింటు సమావేశంలో చర్చించి, భవిష్యద్భారత ప్రభుత్వం బలీయమైన ఫెడరల్ ప్రభుత్వంగా ఉండాలని తీర్మానించారు. పరిపాలనా వ్యవహారాలను మూడు జాబితాలుగా, అంటే 1935 చట్టంలో ఉన్నట్లే, విభజించడానికి నిర్ణయించినట్లు తెలుస్తున్నది.

వివరాలను నిర్ణయించేముందు రాష్ట్రరాజ్యాంగ ఉపసంఘ సూత్రాలను పరిశీలిస్తున్నది. రాష్ట్ర అధిపతిగా గవర్నర్ని ఉంచడానికే ఈ ఉపసంఘం నిర్ణయించుకొన్నట్లు తెలుస్తున్నది. అయితే ఈ గవర్నర్ ఎన్నిక కావాలి.

ఈ రెండు సంఘాలూ తిరిగి రేపు సమావేశమౌతున్నవి.

విభజన పూర్తి అయ్యేవరకూ ప్రభుత్వ విధానాలకు సంబంధించి ఎలాంటి నిర్ణయాలూ జరగరాదని కేంద్ర ప్రభుత్వం వివిధ శాఖలకు ఉత్తరువులు చేసినట్లు తెలుస్తున్నది. కేంద్ర ప్రభుత్వ శాఖలు మామూలు నిత్య కృత్యాలకు సంబంధించిన పనులను మించి ఏమీ చేయరాదనికూడా ఈ ఉత్తరువులలో సూచించినట్లు తెలుస్తున్నది.

విభజనకు సంబంధించి ఆస్తి పాస్తుల పంపకం వివరాలను తయారు చేయవలసిందని కూడా ఈ శాఖలకు చెందిన ఉద్యోగులను కోరినట్లు తెలుస్తున్నది.

## సోవియట్ ఆరోపణలకు నాగేజవాబు

### హంగరీ పరిస్థితిపై రష్యాసేనానికి బ్రిటన్ విజ్ఞప్తి

జనీవా, జూన్ 9: "నాప్రభుత్వాన్ని కూలద్రోయడానికి నేను, నాపార్టీ అనుచరులు కుట్రపన్నినట్లు సోవియట్ అధికారులు చేసిన ఆరోపణలు పచ్చి అబద్ధాలు. అలాంటి ప్రయత్నంచేస్తే నాపై నేనే కుట్రపన్నుకోవడం గాక మరేమౌతుంది" అని హంగరీమాజీప్రధాని సోవియట్ ఆరోపణలను ఖండిస్తూ పత్రికావిలేఖరుల సమావేశంలో ప్రకటించాడు. బుడాపెస్టు అధికారుల త్రిప్పులకంగానేతాను స్విట్జర్లండులో ఉండి ప్రధానిత్వానికి రాజీనామా నివ్వవలసి వచ్చిందని, తాను రాజీనామా యివ్వక పూర్వకమే 'నాగీ తన ప్రధాని పదవికి రాజీనామా యిచ్చాడు'అని స్విట్జర్లండులో ఉన్న హంగరీ రాయబారవర్గం ఒకవార్తను సృష్టించి వెల్లడించిందనీ నాగీ అన్నాడు.

"హంగరీ రాజకీయాల్లో యింత ఆకస్మిక పరిణామాలు సంభవించడం నాకు పూర్తిగా ఆశ్చర్యాన్ని కలిగించాయి. కేవలం విశ్రాంతికోసం నేను స్విట్జర్లాండు బయలుదేరేటప్పుడు నాదేశంలో పరిస్థితులు శాంతంగాను సంతృప్తికరంగాను ఉన్నాయి. రష్యన్ అధికారుల నిర్బంధంలో ఉన్న స్మాల్‌హోల్డర్స్ పార్టీ కార్యదర్శి బెలాకోవాక్సను హంగరీ ప్రభుత్వానికి ఒప్పగించాలని నేను చేసిన విజ్ఞప్తిని లెఫ్టినెంట్ స్విరిడోవ్ (మిత్రమండలి కంట్రోలుదు సోవియట్ అధ్యక్షుడు) త్రోసిపుచ్చాడని తెలుపుతూ మే 18-వ తేదీన నాకొక టెలిఫోనువార్త చేరింది. పైగా ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి ఉద్దేశింపబడిన కుట్ర ప్రధానికి (నాకు) తెలిసియే ఉందని కోవాక్సను ప్రశ్నించగా ఆయన వాఙ్మూల మిచ్చినట్లు, తెలుపుతూ అందుకు సంబంధించిన వివరాలను కొన్నింటిని జనరల్ స్విరిడోవ్ హంగరీ ప్రభుత్వానికి నివేదించాడట. మే 28-వ తేదీ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు ఉపప్రధానిఅయిన మట్యాస్ రకోసీ మంత్రివర్గసమావేశాన్ని ఏర్పాటు చేశాడు. స్విట్జర్లాండునుంచి నన్ను వెంటనే బుడాపెస్టుకు పిలిపించాలని యీ సమావేశం నిర్ణయింపబడింది" అలాగే నాకు కబురు అందింది. నాపై ఆరోపణలన్నీ నిరాధారములని చెబుతూ, వెంటనే బుడాపెస్టుకు రావడానికి నాకేమీ అభ్యంతరంలేదని తెలియజేశాను. నన్ను వెంటనే బుడాపెస్టుకు రావల్సిందని కోరుతూ, పరిస్థితులన్నీ సక్రమంగానే జరుగుతాయని హామీ యిస్తూ హంగరీ అధ్యక్షుడు నోల్టక్ టిల్డీ నాకు టెలిఫోన్ చేశాడు. కాని బెర్నీలో ఉన్న హంగరీ మంత్రి గార్డన్ నా దగ్గరవచ్చి, యేకారణంమీదనైనా సరే నీవు యిప్పుడు బుడాపెస్టు వెళ్లవద్దు అని బ్రతిమాలాడు. బెర్నీ వెళ్ళవద్దని సలహాయిస్తూ నా మిత్రులనేకమంది వర్తమానాలు పంపారని చెబుతూ వాటి నన్నింటిని యీయన నాకు చూపాడు. నేను హంగరీ వెళ్లడానికే నిశ్చయించుకొన్నానని, గార్డన్‌తో చెప్పాను. కాని నేను బెర్నీకిరాగానే, నన్ను బుడాపెస్టు రావద్దని హెచ్చరిస్తూ హంగరీ అధ్యక్షుని సమ్మతిమీద ఒక వర్తమానం పంపబడినట్లు గార్డన్ తెలియజేశాడు. మే 30 వ తేదీన హంగరీ ప్రభుత్వ సహాయకార్యదర్శి హంగరీ పరిస్థితిని గురించి టెలిఫోనులో చర్చిస్తూ, హంగరీకి నీవు బయలుదేరవచ్చు, కాని మార్గమధ్యంలో యేమి జరిగినా జరగవచ్చునని నాకు హెచ్చరిక చేశాడు. హంగరీ ప్రతిష్టంభనను అంతమొందించడానికి నీవు స్విట్జర్లాండులో ఉండే రాజీనామా యివ్వడం ఉత్తమం అని యీన నాకు సలహా యిచ్చాడు.

"నేను రాజీనామా యివ్వడానికి రాజ్యాంగ విషయాలరీత్యా యే కారణమూ లేదు. కాని హంగరీ రాజకీయ పరిస్థితి మరింత విషమ స్వరూపం దాల్చకుండా నివారించేందుకే రాజ్యాంగ సూత్రాన్ని మరిచి రాజీనామా యివ్వడానికి నేను అంగీకరించాను: జూన్ 1 వ తేదీన రాజీనామా యిచ్చాను. నా ఐదేండ్ల కుమారుడు భద్రంగా నాకడకు చేరిన పిమ్మటనే నేను రాజీనామా యిచ్చాను."

సంపూర్ణ ప్రజామోదంతో ఎన్నికైన ప్రధాని ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు కుట్ర పన్నాడు. లేక కుట్రలో పాల్గొన్నాడు అనే విషయాన్ని యెవరైనా ఊహించగలరా?

ఇంతకూ నేను కుట్ర చేశాననే మాట అసత్యం, కాని నన్ను కూలద్రోయడానికి కుట్ర జరిగినమాట వాస్తవమని తేలింది." "నా ఆస్తినంతా స్విట్జర్లాండు చేరవేసుకొన్నానని విపరీతంగా వదంతులు వ్యాపించాయి ఇంతకూ నాకు ఉన్న ఆస్తి ఎంత? ఏదో కొన్ని ఎకరాల భూమి మాత్రమే. బుడపెస్టునుంచి నాతో తెచ్చినదైన ఆస్తిపాస్తులు ఏవో అనిగాక ఏమీ నాకులూ తెప్పించుకోలేదు. ఎవరైనా తెప్పించగలిగితే. నేను, నా కుటుంబీకుల కట్టు బట్టలు మాత్రమే.

### సోవియట్ సేనానికి బ్రిటిష్ ప్రభుత్వపు ద్వితీయ విజ్ఞప్తి

నాగీపై సోవియట్ అధికారులు చేసిన ఆరోపణలను రుజువుపర్చే పత్రాలను పంపమని కోరుతూ, మేజర్ జనరల్ జి. పి. ఎడ్జ్‌కట్ బ్రిటిషు ప్రభుత్వం తరఫున బుడాపెస్టులోని సోవియట్ సేనానికిఇంకో విజ్ఞప్తి పంపారు. బుడాపెస్టులోని బ్రిటిషు రాయబారిద్వారా బ్రిటిషు ప్రభుత్వం లోగడ సోవియట్ సేనానికి యిలాంటి విజ్ఞప్తికే పంపింది. నాగే ఆరోపణల ఋజువుకు సంబంధించిన పత్రాలు హంగరీ ప్రభుత్వం దగ్గర ఉన్నాయని, వాటిని బ్రిటిషు ప్రభుత్వానికి పంపడానికి హంగరీ ప్రభుత్వ వ్యవహారాల్లో జోక్యం కల్గించుకోవలసివస్తుందని, ఆ పని తాము చేయలేమని చెబుతూ, సోవియటు సేనాని స్విరిడోవ్ బ్రిటిషు ప్రభుత్వానికి ఒకలేఖ పంపారు. ఆలేఖకు సమాధానంగా బ్రిటిషు ప్రభుత్వం తరఫున మళ్లీ యీ విజ్ఞప్తి వెళ్లింది.

### అమెరికా విధానం: బ్రిటన్‌కు క్లిష్టపరిస్థితి

లండన్, జూన్ 7: హంగరీ రాజకీయాల్లో సోవియట్ ప్రమేయాన్ని తీవ్రంగా నిరసిస్తూ అమెరికా పంపదలచుకొన్న 'ఆక్షేపణ' మూలకంగా తూర్పు మధ్యయూరోపుదేశాలపట్ల బ్రిటన్ అనుసరిస్తున్న విధానం చాలా క్లిష్టపరిస్థితుల్లో పడవలసివస్తుంది. ఈ ప్రాంతంలో (తూర్పు మధ్య యూరోపియన్ దేశాలలో) సోవియట్ ప్రాబల్యం హెచ్చుగా ఉంది. హంగరీ ప్రభుత్వ పునర్నిర్మాణం, బల్గేరియా ఎసెంబ్లీ ప్రతిపక్ష నాయకుని అరెస్టు, రుమేనియాలో ప్రముఖ ప్రతిపక్ష సభ్యుల నిర్బంధం యివన్నీ మాస్తే సోవియట్ ప్రాబల్యం మరొక నూతనఘట్టం ప్రవేశం చినట్లు కన్పిస్తోందని లండన్ రాజకీయ అభిజ్ఞవర్గాలవారు భావిస్తున్నారు. బాల్కన్ సంధి ఒడంబడికలు అమల్లైతన్మూలంగా రష్యన్ సైన్యాలు ఖాళీ చేయవలసిన పరిస్థితి సంభవించకపూర్వమే, ఆయాదేశాలలో సోవియట్ రష్యాకు అనుకూలంగా ఉన్న శక్తులను సమీకరించి సంఘటితపర్చుకోవడమే యీ ఎత్తు. వీటన్నిటిని కండ్లారా చూచి, వెనుకటిలాగా తన 'అసమ్మతి'ని ప్రకటించి బ్రిటను ఊరుకొంటుందా? లేక రాజకీయ హక్కులకు, పౌరహక్కులకు ఆఘాతం కల్పిస్తున్న యీ చర్యలను అరికట్టడానికి బ్రిటన్ వాస్తవంగా పోరాడుతుందా? యిది యిక తేలవలసిన విషయం. యునైటెడ్ ఆక్షేపణ ఫలితంగా యీ ప్రాంతానికి సంబంధించినంతవరకు బ్రిటిషు విధాన భవిష్యత్తును తేల్చేటట్లు కన్పిస్తుంది.

## త్వరలో రుమేనియాలో కూడా రష్యా జోక్యం

లండన్, జూన్ 7: బాల్కన్ రాజ్యాలలో తన పరిస్థితిని బలపర్చుకోడానికై సోవియట్ రష్యా ప్రారంభించే సమగ్రమైన అంతిమ సాయుధ సన్నాహాలకార్యక్రమంలో, హంగరీ, బల్గేరియా సంఘటనలు తొలిచర్యమాత్రమేనని వైట్‌హాలుకు వచ్చే వార్తలనుబట్టి తెలుస్తోంది.

రుమేనియాలోగూడా తనకు ప్రతికూలంగాఉన్న రాజకీయనాయకులను ఊడిచిపెట్టడం త్వరలోనే ప్రారంభించనున్నదని గూడా వైట్‌హాల్ పెద్దలు భావిస్తున్నారు.

## టర్కీతో ఇరాక్ స్నేహం

బాగ్దాదు, జూన్ 7: ఇరాక్ పార్లమెంటు టర్కీతో ఇటీవల చేసుకున్న స్నేహసంబంధ సంధిని ఎక్కువ మెజారిటీతో ఆమోదించింది. ఈ సంధికి అనుకూలంగా 87 ఓట్లున్నూ ప్రతికూలంగా 14 ఓట్లున్నూ వచ్చాయి.

చర్చనంతరం, యీ సంధి మధ్యప్రాచ్యంలో శాంతిభద్రతలు స్థాపించడానికి సహాయభూతం కాగలదని ఇరాక్ ప్రధాని నూరీపాషా సామాద్ ప్రకటించాడు.

## పంజాబు విపమావస్థ

అమృతసర్, జూన్ 7: అమృతసర్ నగరములో నాటు బాంబులు ప్రేలినప్పటి నుంచిన్నీ స్థితిగతులు విషమముగా ఉన్నవి. బాంబులు ప్రేలినందువల్ల ఏమీ నష్టము కాలేదు. బాకుపోట్ల కేసులు మూడింటిలో ఒకటి ప్రమాదము అయి ఒకరు చనిపోయినారు. నిప్పుపెట్టిన కేసులు 9 జరిగినవి.

## లాహోరు

లాహోరు, జూన్ 7: శనివారము సాయంత్రము 7 గంటలకు తెలిసిన వర్తమానాలు. నగరములో వివిధప్రాంతాలలోనూ బాకుపోట్ల కేసులు 5 జరిగినవి. ఒక చోట బాకుతో పొడవడమువల్ల గాయము అయిన వాడు అక్కడనే చనిపోయినాడు. అరెస్టులు జరగలేదు.

# స్పెయిన్‌లో రాజరిక ప్రభుత్వం

## ఫ్రాంకో యిష్టంవిూదనే యేర్పడాలట

'ఉత్తరాధికార శాసనానికి' స్పెయిన్ శాసనసభ ఆమోదం

మాడ్రిడ్, జూన్ 7: ఆయన ఇష్టమొచ్చినంత కాలము జనరల్ ఫ్రాంకోయే ప్రభుత్వాధిపేతగా ఉండడానికి అంగీకరిస్తూ, స్పెయిన్‌ను నామమాత్రపు రాజరిక దేశంగా ప్రకటిస్తూ "ఉత్తరాధికార శాసనాన్ని" స్పెయిన్ కార్పొరేట్ పంబరు నేటిరాత్రి ఆమోదించింది. బ్రహ్మాండమైన హర్షధ్వానాల మధ్య సభ్యులు యీ శాసనాన్ని ఆమోదించారు. ఈ శాసనాన్ని సమర్థిస్తూ ఛంబరు అధ్యక్షుడు బిల్బావ్ ఉపన్యసించాడు. "స్పెయిన్‌లో రాజరిక ప్రభుత్వం పునరుద్ధరింపబడాలంటే, పరిపాలనా పరలే అవిచ్ఛిన్నంగా కొనసాగాలి. ఇలాంటి రాజరిక ప్రభుత్వం యేర్పడే అవకాశము పరిస్థితులు సంభవించినప్పుడు, క్రమపద్ధతి ప్రకారం అలాంటి ప్రభుత్వం యేర్పడే హామీఉండడం సముచితం. ప్రజలనిమిత్తమే దేశంలో రాజులు యేర్పడతారు. అంతేగాని రాజుల నిమిత్తం ప్రజ లేర్పడరు.

పరస్పరవిద్వేషాలకుగాని, అగ్రహావేశాలకుగాని యీ శాసనంలో యేవిధమైన అవకాశంలేదు. సేవరకుగా ఫ్రాంకో తన అధికారాన్ని వప్పగిస్తేనే స్వీకరిస్తానంటూ, డాన్ జుఆన్ చేసిన ప్రకటనకు సమాధానప్రాయంగా చెబుతూ "సేవరకు" అనే పదాన్ని నిరంకుశరాజులు మాత్రమే ఉపయోగిస్తారని యీయన అన్నాడు. జనరల్ ఫ్రాంకోకన్నా వేరే అధినేత స్పెయిన్‌కు లేడు. ఫ్రాంకో యిష్టంమీదనే యే రాజైనా స్పెయిన్‌పై రాజరికాధికారాన్ని స్వీకరించాలి" అని యీయన అన్నాడు.

ఈ ఉత్తరాధికార శాసనంలో మొత్తం 15 నిబంధనలున్నాయి. ఈ శాసనాన్ని సమర్థిస్తూ మాట్లాడింది ఛేంబరు అధ్యక్షుడు ఒక్కడే. ఆ పిమ్మట సభికులు యీ శాసనాన్ని ఆమోదించారు.

# జిన్నాకుట్రాన్సుజోర్డన్‌రాజు అభినందనములు

న్యూఢిల్లీ, జూన్ 7: పాకిస్థాను సిద్ధించినందుకు లీగు అధ్యక్షుని అభినందించుచు ట్రాన్సుజోర్డన్ రాజు అబ్దుల్లా ఇబిన్-ఇ-హుస్సైన్ జిన్నాగారికి తంతి వార్త నంపియున్నారు. పాకిస్థానుకు శాంతిసౌఖ్యములు కలుగుగాక యని, జిన్నాగారికి ఆయురారోగ్యములు కలుగుగాక యని తంతివార్తలో ట్రాన్సుజోర్డన్ రాజు కోరుచున్నాడు.

జిన్నాను అభినందించుచు టెహెరెన్ మహమ్మదీయులు ఒక తంతివార్త పంపియున్నారు. అ. ప్రె.

# ఇండోనేసియను రిపబ్లికును ఈజిప్ట్ అంగీకరించెను

సింగపూరు, జూన్ 7: ఈజిప్టు ప్రభుత్వము ఇండోనేసియను రిపబ్లికును అంగీకరించెనని, సదరు రిపబ్లిక్‌తో మిత్రసంధిని, వాణిజ్య ఒడంబడికను చేసికొనెనని ఇండోనేసియన్ ఏజన్సీ సింగపూరు కార్యాలయమువారు నేడు తెలిపిరి. అ. అ. ప్రెస్

# సైనికులకు క్రొత్త జీత ప్రమాణములు

త్వరలో ఉత్తరువులు జారీయగును

న్యూఢిల్లీ, జూన్ 7: "సైనికులక్రొత్త జీత ప్రమాణములు విషయమై ఇండియా ప్రభుత్వమువారు అంత్యనిర్ణయములు గావించియున్నారు. మే 1 తేదీ జీతకముశాఖ ప్రకటనలో వాగ్దానము చేయబడి యుండిన ట్లు చాలా త్వరలో ఉత్తర్వులు జారీ చేయబడును" అని ఇండియా ప్రభుత్వ ప్రకటనయొకటి తెలుపుచున్నది. ఇందుకు సంబంధించిన ఉత్తరువులను అకౌంటుశాఖవారు ఇతర శాఖలవారు పరిశీలింపవలసియున్నది. ఎందువల్లననగా ఈ ఉత్తర్వులను అమలు చేయవలసినవారు ఆ శాఖలవారై యున్నారు. ఈ ఉత్తర్వులను మొదటినుండి సంతృప్తికరముగా అమలుచేయవలసినయెడల యిట్టి పరిశీలన అవసరము. ... మే మాసాంతములో పూర్తిగా జరుగలేకపోయెను. జూన్ 3 వ నాటి నములో ఈక్రొత్త ప్రమాణములు ప్రచురింపబడునని అనుకొనుచున్నారు. అని ప్రభుత్వ ప్రకటన తెలుపుచున్నది. అ. ప్రె.

# 22 వేల ప్రాథమిక పాఠశాలలు

అలహాబాదు, జూన్ 7: 6-11 సంవత్సరముల మధ్య వయస్సుగల పిల్లల విద్యకై రాష్ట్రమునందలి అన్ని జిల్లాలలోను ఈ సంవత్సరము సంII రాII ప్రభుత్వమువారు దాదాపు 22 వేల ప్రాథమిక పాఠశాలలను స్థాపింప నిశ్చయించెనని తెలియుచున్నది.

# గాజుల్లంక కాల్పులు

## ప్రభుత్వకమిటీ విచారణ

మచిలీపట్నం, జూన్ 5: గాజుల్లంకలో పోలీసులు తుపాకులు కాల్చియుండిన సందర్భముగూర్చిన నిజపరిస్థితులను విచారణ చేయుటకై యీక్రిందివారొక విచారణ సంఘముగా నియమింపబడిరి. (1) అడిషనలు జిల్లా మేజస్ట్రేటు డి. ధనసింగుగారు (నెయిర్మను) (2) టి. కే. టి. ఎస్. ఆర్. తాతాచారిగారు బి. ఏ. బి. యల్. (యం. యల్. ఏ) (3) శ్రీమతి వి. సీతామహాలక్ష్మమ్మగారు (యం. ఎల్. ఏ) వీరు మద్రాసు గవర్నమెంటువారిచే 8-5-47 తేదీని ప్రకటింపబడిన ఉత్తరువు ప్రకారముగా నియమింపబడిరి. 10-4-47 తేదీని గాజుల్లంకలో జరిగిన సంఘటనల గూర్చి విచారణచేసి తమ నివేదికను మదరాసు గవర్నమెంటుకు నివేదింపవలసినదిగా కోరబడిరి. ఈ కమిటీ సభ్యులు 20-5-47 తేదీని మచిలీపట్నంలో సమావేశమై విచారణ చేయవలసిన అంశముల గూర్చి చర్చించిరి. దివి తాలూకాలోని శ్రీకాకుళమునందు 26-5-47 తేదీ మొదలు 1-6-47 తేదీవరకు 30 మంది సాక్షులను విచారణచేసి వారి వాఙ్మూలములను తీసికొనిరి. అధికారులచే సూచింపబడినవారివద్దను యితర వర్గములవారిచే సూచింపబడిన వారివద్దను సాక్ష్యము గైకొనబడెను.

ఈ క్రిందిసాక్షులు విచారణచేయబడిరి. (1) తుపాకులను కాల్చినపోలీసుదళములో చేరియున్న హెడ్ కానిస్టేబిలు, మరొక ఇద్దరు పోలీసులు (2) డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు (3) బందరు సబుడివిజనలు మేజస్ట్రేటు (4) పామర్రు సర్కిలు ఇన్‌స్పెక్టరు (5) పోలీసు సబుఇనస్పెక్టరు (6) వైద్యులు ముగ్గురు (7) పోలీసువారిచే ప్రవేశపెట్టబడిన మరొక 11 మంది సాక్షులు (8) గాజుల్లంక కరణంగారితోసహా ఆ గ్రామంలోని 6 గురు రైతులు (9) చల్లపల్లి ఎస్టేటుదివానుగారున్నూ, ఎస్టేటుతరఫున మరొక ఇద్దరున్నూ సాక్ష్యమిచ్చిరి.

1-6-47 తేదీకి విచారణ పూర్తికాగానే ఈ కమిటీ అధ్యక్షులు తప్ప మిగిలిన ఇద్దరు కమిటీమెంబర్లున్నూ గాజుల్లంకకున్నూ కృష్ణానదిలోని ఇతర లంకలకున్నూ వెళ్లి చూచి 3-6-47 తేదీకి తిరిగి మచిలీపట్నము చేరిరి. ఈ కమిటీ తిరిగి త్వరలోనే మద్రాసులో సమావేశమై తమ నివేదికను తయారుచేసి మద్రాసుగవర్నమెంటుకు సమర్పించెదరని తెలియుచున్నది.

పోలీసువారి సాక్ష్యంలో హెడ్‌కానిస్టేబిలు పి. యేసుదాసుయొక్క సాక్ష్యం ముఖ్యమైనది. తుపాకులు కాల్చిన రిజర్వు పోలీసుదళమునకు యితడు అధిపత్యము వహించినవాడైయుండెను. గాజుల్లంకలోను చుట్టుపక్క లంకలలోను గల రెల్లు జమీందారుగారిదనియు యిప్పుడది గవర్నమెంటు అధీనంలో ఉన్నదనియు దానిని ఎవ్వరూ కోసికొని పోకుండా రక్షించుటకై యీ పోలీసుదళము అచటకి పంపబడెనని చెప్పెను. ఈ పోలీసుదళము చింతల్లంకలో (గాజుల్లంకకు ఉత్తరంగా) ఉన్న జమీందారుగారి గొడ్లపాకలలో ముకాముచేసెను. కాపలాదారైన కంటంనేని సుబ్బారావు వచ్చి ఎవరో రెల్లు కోసికొనిపోతున్నారని రిజర్వుపోలీసు దళంతో చెప్పి తనవెంట 6 గురు పోలీసులను తీసికొనిపోయెను. పోలీసులను చూడగానే వారు ఆ రెల్లు మోపులను అక్కడనే పారవేసి పారిపోయిరి. తిరిగి రాత్రి 8 గంటలకు కంటంనేని సుబ్బారావు గాజుల రామశాస్త్రిలు వచ్చి 10 బండ్లమీద రెల్లు తీసికొనిపోతున్నారని చెప్పగా నేను 12 మంది పోలీసులతో తుపాకులతో సహా వెళ్లితిని. పెదవలి గ్రామ కాపురస్థుడైన ... కేటి సాంబయ్య తాలూకు 4 బండ్లు అక్కడ ఉండెను. ఆ గ్రామవాసులవే మరొక 2 బండ్లు యుండెను. ఇంకా కొంచెం దూరంలో మరొక 4 బండ్లు ఖాళీగా ఉండెను. సాంబయ్యతో సహా 6 గురు బండ్ల వాండ్లను పట్టుకున్నాము. బండ్లతోసహా చల్లపల్లి పోలీసు స్టేషనుకు వారిని తీసికొని పోతున్నాము. కృష్ణ ... చేరేసరికి ఒకపెద్ద గుంపు వచ్చింది. "బండ్లను తీసికొని పోవద్దు. మేము వస్తున్నాము. కమ్యూనిస్టు పార్టీకీ జై అని కేకలువేస్తూ గుంపువస్తోంది. అప్పటికి బండ్లు ఏటివాడు యినుకలోదిగి 30 గజాలు లేక 40 గజాలు నడచినవి. ఆ గుంపులో 300 మంది యుంటారు. వారిలో స్త్రీలు పురుషులు పిన్నలు పెద్దలు యున్నారు. వారు కర్రలతోను కర్ర బొడవళ్లతోను వచ్చారు. మాకు 15 గజాల దూరంలోకి వచ్చి మమ్ములను ముట్టడలచారు. ఆ స్పుడు గా. రామశాస్త్రి లు మాయమై పోయినాడు. కంటంనేని సుబ్బారావు మాత్రం దున్నను ఆగుంపులో కొందరు బండ్లను వెనుకకు తోలుకొని పోసాగిరి. ఆగుంపుమాత్రము మాచుట్టుచేరి "మీరు జమీందారు సొమ్ము తింటున్నారు. ఈ రాత్రివేళ మాలంకలోకి ఎందుకు వచ్చారు అని ప్రశ్నించినారు. మీరు మా గ్రామానికి వండి మా గ్రామ మునసబు మాట్లాడడానికి రమ్మన్నాడు అని ఆ జనులు కేకలు వేసిరి. కావలిస్తే ఉదయం వస్తామని మేము బదులుచెప్పాము. ఇంతలో ఒక రెల్లు మోపుకు నిప్పంటించినారు. ఆ వెల్తురులో ఆగుంపులోనివారిని కొందరిని ఆరాత్రివేళ గుర్తించగల్గితిమి. పోలీసువాళ్లను యీమంటలలో వేయండి. వాళ్ల తుపాకులు లాక్కొని కట్టకట్టండి" అని జనులు అరిచారు. "వారిని మన గ్రామానికి తీసికొనివెళ్లి అక్కడ సర్కారిద్దాం" అని మరికొందరు అరిచారు. అప్పటికింకా చంద్రోదయం కాలేదు. 1039 నెం. పోలీసు కనిస్టేబులును అగుంపులోనివారు కొందరు పట్టుకొని ఎత్తుకొని పోతున్నారని 879 నెం. పోలీసుజవాను కేకవేశాడు. అలా తీసికొనిపోరాదుఅని నేను జనాన్ని మందలించాను. ఇంతలో అయిదారుగురు వచ్చి నన్ను పట్టుకున్నారు. నన్ను 10 గజాలదూరం తీసికొనిపోయినారు. మీ గ్రామానికి నేను రానుఅన్నాను. ఇంతలో ఒకడు నా గొంతు పట్టుకొని నొక్కెను. "నన్ను చంపివేయడానికి చూస్తున్నారు. కనుక, మీ ప్రాణాలు రక్షించుకొనడానికి మీరు తుపాకులనైనా కాల్చండి" అని నేను నా పోలీసులను హెచ్చరిస్తూ కేకవేశాను. ఇంతలో నా తుపాకీ నా చేతికి సరిగా అమరింది. నేను రెండుసార్లు కాల్చాను. నా వెంటవచ్చిన పోలీసులలో కొందరికి గాయములైనవి. అందువల్ల వారుకూడా తుపాకులు కాల్చిరి. అప్పటికి 1039 నెంII పోలీసును జనులు ఎత్తుకపోయినారు. ఎన్నిసార్లు నా పోలీసులు తుపాకులు పేల్చిరో నాకు తెలియదు. అంతట జనులు చెల్లాచెదరై పోయినారు. 1264 నెంII పోలీసుకు బుజాలమీద గాయములై పడిపోయుండగా చూచాను. 866 నెం. పోలీసుకు కూడా గాయములై క్రిందపడెను. 929 నెం. పోలీసుకుకూడా దెబ్బలు తగిలెను. ఆటుపిమ్మట 1039 నెం. పోలీసు మాతో వచ్చి కలిసికొనెను. అప్పుడు చీకటిగానే ఉన్నది. నేను బుజాలమట్టంమీద గురిపెట్టి తుపాకులు కాల్చాను. ఎవరికి తుపాకీగుండు తగిలిందో ఎవరు మరణించారో నాకు తెలియదు. నా తుపాకీ 2,000 గజాల దూరము గలది. మొదటిసారి తుపాకులు నదిఒడ్డుమీద గ్రామంపైపుకు కాల్చబడెను. మేము తిరిగి వెనుకకు పోతూఉంటే కొందరు జనులు రెల్లులోనుండి వచ్చి "కర్రలతో కొట్టండి" అని కేకలువేశారు. అప్పటికి 1039 నెం. 1264 నెం. 879 నెం. పోలీసులు ఏమైనారో కన్పించడంలేదు. మిగిలిన పోలీసులము మేము 8 మంది మాత్రమే గాయపడినవారితోసహా ఉన్నాము. జనులు మామీదికి వస్తున్నారనేభయంచేత ఆగుంపు మాకు 10 లేక 15 గజాల దూరంలో ఉండగా నేను ఒకసారి తుపాకి కాల్చాను నా వెంట నున్నవాళ్లు ఎన్నిసార్లు కాల్చిరో నాకు తెలియదు. రెండోసారి కాల్చిన పిమ్మట కూడా జనులగుంపు యింకా పోలేదు. ఇంకా మా విూదకు వస్తునే యున్నారు. అప్పుడు 974 నెం. పోలీసును రెండుసార్లు కాల్చమన్నాను. నేను మాత్రం కాల్చలేదు. ఇతర పోలీసులు కూడా కాల్చలేదు. ఆటుపిమ్మట జనులు లంకలోకి వెళ్లిపోయినారు. మేము తిరిగి మా ముకాముకు పోతూ ఉండగా మా ముకాము తగులబడుచుండుట చూచినాము. కంటంనేని సుబ్బారావు మాతోనే ఉన్నాడు. కాని అతనికి గాయాలు కాలేదు. అతనిని జనులు కఱ్ఱలతో పొడిచారు. కాని మేము అతనిని రక్షించాము. ఇక మా ముకాముకు చేరితే లాభం లేదని మేము సుబ్బారావు గాయపడ్డ 1257 నెం. 866 నెం. 929 నెం. పోలీసులతో శ్రీకాకుళం వెళ్లినాము. అప్పటికి రాత్రి 10-30 కంటలైంది. ఆ క్కడినుంచి టెలిఫోను చెయ్యాలంటే అది పనిచేసే స్థితిలో లేదు. నారిపోట్టును రాజాగారి మనిషికిచ్చి చల్లపల్లి పోలీసు స్టేషనుకు పంపితిని. రాత్రి 11 గం. 12 గం. మధ్య నారిపోట్టును వ్రాశాను. రాజాగారిమనిషి పేరు నాకు తెలియదు.

చనిపోయినవారి రెండుశవములకు సబ్ ఇన్‌స్పెక్టరు శవపంచాయితీ జరిపెను. ఆ రెండు శవాలు వారియింటవద్ద ఉండెను. ఒకశవం స్త్రీది. రెండవది ఒక పురుషుని శవం. వయస్సు 19 సంII ఇద్దరూ గుండు దెబ్బలవల్ల మరణించారు.

రెల్లు... ఎవరిసొత్తు అనే విషయమై నేను దరియాప్తుచేయలేదు. నేను బందోబస్తుడ్యూటీమీద ఉన్నాను నాడ్యూటీలు ఏమిటో నిర్ధారణగా నాకు పైఅధికార్లు తెలియజేసి నన్ను పంపలేదు.

మొదటిసారి తుపాకులను కాల్చినప్పుడు, తుపాకులను కాల్చబోతున్నామని ముందుగా జనానికి నేను హెచ్చరిక చేయలేదు. మేము గాలిలోకి గుండ్లు ప్పేలలేదు. రెండోసారి కాల్చేముందు తుపాకులను కాలుస్తానని హెచ్చరించాను. చనిపోయిన స్త్రీమీద నేను గురిపెట్టి కాల్చలేదు. ఆచీకటిలో ఆ సమూహంలో పురుషులెవరో స్త్రీలెవరో గుర్తించలేను. మా వేపనులు మేమే వంటచెప్పు కొన్నాము. మాకు కావలసిన యితరవస్తువులను జమీందారుగారి మనుష్యులు సప్ల యిచేశారు. గాజులంకజనసంఖ్య నాకు తెలియదు. ఇటువంటిసంక్షోభాన్ని అణచుటకు నేను తీసికొని వెళ్లిన పోలీసుదళం చాలదని నా అభిప్రాయం.

# అమెరికా ఆయుధ బలాన్నితగ్గించుకోరాదు

## అధ్యక్షుడు ట్రూమన్ ఉపన్యాసం

కన్సాస్ సిటీ, జూన్ 8: "జపాన్, జర్మనీలు లొంగిపోయిన తర్వాత అమెరికా తన సాయుధ సైన్యాలను తగ్గిస్తూఉండడం శాంతి వాంఛించే రాజ్యాలమీదికి దండెత్తడానికి ఇతర సామ్రాజ్యాలకు ప్రోత్సాహం కలిగించినట్లవుతోంది." అని ఈ రాత్రి ఒక ఉపన్యాసంలో ప్రెసిడెంటు ట్రూమను అమెరికను ప్రజలను హెచ్చరించాడు.

తాను ప్రథమ ప్రపంచ సంగ్రామంలో పనిచేసిన ఒక రెజిమెంటును పునర్మించే సందర్భంలో అందలి సైనికులనుద్దేశించి ఆయన ఇంకా ఇలా అన్నాడు.

"ఈ సైనికోద్వాసన ఇట్లాగే జరుగుతూఉంటే మన ఆదర్శాలలో ఏకీభవించి మన నాయకత్వంకోసం ఎదురుచూస్తున్న బలహీన రాజ్యాలకు మన సామర్థ్యంమీద విశ్వాసం నశిస్తుంది. ఇదివరలో ప్రజాస్వామిక రాజ్యాల శక్తిసామర్థ్యాలు తక్కువగా ఉన్నాయని అనుకోవడం వల్లనే హిట్లరు యుద్ధంలోకి దిగాడు. అతని శత్రుపక్షంవారి అసంసిద్ధత 1939 లో పోలెండుమీదికి దండెత్తేటట్లు అతన్ని త్వరపరచింది. అమెరికా ఎదుర్కొలేనంత బలహీనంగా ఉన్నదని అనుకోవడం వల్లనే జపాన్ పెరల్ హార్బరును ముట్టడించింది. అందుచేత మనం మన సాయుధ భూ నావికా వాయుదళాల నన్నింటినీ అవసరమైనప్పుడుపయోగించడానికి సమగ్రంగా నిలబెట్టుకోవాలి. వాటికి సరియైన శిక్షణనిచ్చి సుశిక్షిత ప్రజల అండతో ఒకే ఒక పెద్ద సైనికసంస్థగా ఏర్పాటుచెయ్యాలి. అమెరికాకుగాని మరే రాజ్యానికిగాని యుద్ధవిరమణంవల్ల శాంతికి బదులుగా చావో వినాశమో వస్తుంది. మనం ప్రపంచంలో అన్నింటికంటె శక్తివంతమైన రాజ్యంలోని ప్రజలం కాబట్టి తక్కిన ప్రపంచ జనానీకాని కంతటికీ శాశ్వత శాంతి సమకూర్చవలసిన బాధ్యత మనమీద ఉన్నది.

శాంతి, ఐక్య, అంతర్జాతీయ సహకార విషయాల్లో మన ఆశలన్నీ ఐక్యరాజ్య సమితిలో ఇమిడిఉన్నాయి. మళ్లీ యుద్ధం రాకుండా చెయ్యాలన్న ఐక్యరాజ్యసమితివారి ఆదర్శాన్ని సాధించడానికి మనం అన్నిప్రయత్నాలూ చేద్దాము.

ఐక్యరాజ్య సమితితో సహకరించడంలో ప్రపంచశాంతి హేతువైన మూల సూత్రాన్ని మనం గుర్తుంచుకోవాలి. ఆ సూత్రం 'ఏ రాజ్యానికిగాని ఇతరులు తన మీదికి దండెత్తివస్తారన్న భయంలేకుండా స్వేచ్ఛగా బతకడానికి హక్కుఉన్నది!' అనేదే!

# పట్టాభి హెచ్చరిక

[1 వ పేజీ తరువాయి]

గారికి ఆహ్వానం పంపబడుతోంది. యీ వర్గానికి రాజ్యాంగ పరిషత్తులో రెండు సీట్లు ఉన్నవి. రెండోసీటుకు వచ్చే మాస మధ్యంలో ఎన్నికలు జరుగుతవి. జౌ... సంస్థాన మాజీ ప్రధాని అయిన అప్పాసాహెబ్ పంత్‌గారు ఎన్నుకోబడవచ్చునని తెలుస్తున్నది. దక్కన్ సంస్థాన కూటమికి వచ్చేనెల మధ్యలోగానే ఒక తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేయబడవచ్చును. కూటరాజ్యాంగం కూడా ఆ నాటికి తయారై ఉంటుంది.

ఈ వర్గంలో సంస్థానాధిపతుల కుండవలసిన ప్రత్యేక హక్కులు, వ్యక్తిగత ఆదాయం ఇత్యాది విషయాలు తేల్చుకోడానికి, సంస్థానాధిపతులు రాజ్యాంగ పరిషదధ్యక్షులైన రాజేంద్రప్రసాద్ గారి వద్దకు రాయబారం వెళ్లి ఆయన మధ్యవర్తిత్వాన్ని అర్థిస్తారని తెలుస్తోంది.

బుండీసంస్థానం ప్రవేశం

న్యూఢిల్లీ, జూన్ 7: బుండీమహారాజాగారు నేడు వల్లభాయ్‌పటేల్ను సందర్శించి, తన సంస్థానం వెన్వెంటనే రాజ్యాంగపరిషత్తులో చేరడానికి నిర్ణయించుకున్నదని తెలియజేశాడు.

# ఇండోర్లో సమ్మె విరమణ

ఇండోర్, జూన్ 7 ఇండోర్‌లో నాలుగువారాలుగా సమ్మెచేస్తున్న గుమాస్తాలు, నిమ్నోద్యోగులు తమ కోర్కెలను సానుభూతితో పరిశీలించడమౌతుందని మహారాజాగారు మాట ఇచ్చినందున జూన్ 9 వ తేదీనుంచి మళ్లీ పనికి పోవడానికి నిర్ణయించుకున్నారని అధికారరీత్యా తెలియవచ్చింది.

భోపాల్ నవాబుతో, తదితర సంస్థాన ప్రతినిధులతో సంప్రతిస్తున్న వైస్రాయి లార్డ్ మౌంటుబాటెన్.

కాంగ్రెస్, లీగ్, సిక్కు ప్రతినిధులతో వైస్రాయి లార్డుమౌంట్‌బాటన్ సంప్రతింపులు

# కేంద్రశాసనసభల భవిష్యత్తు

## వైస్రాయి కార్యవర్గ చర్చలు

న్యూఢిల్లీ, జూన్ 8: శుక్రవారం ఉదయం వైస్రాయి కార్యవర్గ సమావేశం జరిగింది. ప్రస్తుత కేంద్రశాసనసభల రద్దు చేయడం మూలంగా ఏర్పడే వివిధ సమస్యలను కార్యవర్గం చర్చించినట్లు తెలుస్తున్నది. ప్రస్తుత కేంద్రశాసనసభల స్థానే రెండు ప్రత్యేక శాసనసభలు ఏర్పాటు చేయబడవచ్చును. హిందుస్థాన్‌కు సంబంధించినంతవరకు ఇప్పటి రాజ్యాంగ పరిషత్తే శాసనసభగా వ్యవహరిస్తుంది. అలా జరిగేపక్షంలో ప్రస్తుత పరిషత్తు అధ్యక్షులు కేంద్రప్రభుత్వ సభ్యులుగాకూడా ఉండవచ్చునా అన్నది ప్రశ్న. కొన్ని సంస్థానాల ప్రతినిధులు ఇప్పటికే పరిషత్తులో పాల్గొంటున్నారు. మరికొందరు వచ్చే సమావేశంలో పాల్గొనవచ్చు. వీరి సంగతి ఏమిటి? పాకిస్తాన్, హిందుస్తాన్ అధినివేశాలకు ఇద్దరు గవర్నర్స్ జనరల్ ఉండాలా లేక ఒకరేఉండాలా? ఈ విషయాలన్నింటినీ వైస్రాయి కార్యవర్గం చర్చించింది.

# రాష్ట్రనాయకులతో గవర్నరు సంప్రదింపులు

లాహోరు, జూన్ 7: నిన్న టిదినము పంజాబు గవర్నరు పంజాబు ఎసెంబ్లీలో ఉన్న మూడుపార్టీల నాయకులతో మాటలాడిన సందర్భములో రాజప్రతినిధి పథకాన్ని గురించి కాకుండా మిశ్రమసంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయడము సాధ్యము అవుతుందా అనే విషయాన్ని కూడా చర్చించినట్లు తెలుస్తూ ఉంది. పంజాబు నాయకులను యీ విషయములో విచారించగా యిందుకు ఎవరూ అనుకూలముగా లేనట్లున్నూ పంజాబుగతి తేలేవరకున్నూ 93 వ సెక్షన్ పరిపాలనము అమలులో ఉన్నప్పటికిన్నీ నాయకులకు యిష్టము అయినట్లున్నూ తెలుస్తున్నది.

# పంజాబు రాష్ట్ర విభజన కార్య సంరంభం

లాహోరు, జూన్ 7: బ్రిటిషు పథకాన్ని అనుసరించి పంజాబు రాష్ట్రాన్ని విభజించేటందుకు పంజాబు ప్రభుత్వము వారు ఒక కార్యాలయాన్ని ఏర్పాటు చేయబోతున్నారు. పంజాబు ప్రభుత్వ సివిల్ సప్లయిస్ కార్యదర్శిగా ఉన్న యం. ఆర్. సచ్‌దేవ్ (ఐ. సి. యస్.) ను పంజాబు పార్టీషన్ కమీషనరుగా నియమించినట్లు తెలుస్తూఉంది. ఈసందర్భములో ఉపసంఘాలను, (1) ఖజానా (2) సెక్రెటేరియట్ (3) ఉద్యోగాలు (4) ప్రభుత్వ సంస్థలు (5) సాధారణ విషయాలు విచారించి నిర్ణయించుటకు 3 పార్టీల నాయకులతో ఒక అనధికార సంఘాన్ని కూడా నియమిస్తారని తెలుస్తూ ఉంది.

# బొంబాయి స్థితి

బొంబాయి, జూన్ 7: కుర్లా ప్రాంతములో రెండుచోట్ల కత్తులతో పోట్లాట జరిగింది. ఆ ప్రాంతములో యీ సాయంత్రము ఏడుగంటలు లగాయతూ మర్నాడు అయిదుగంటల వరకున్నూ కర్ఫ్యూను అమలుపరుస్తూ పోలీసు కమీషనరు ఉత్తరువులు చేసినాడు.

# పరమాణుశక్తిపై అంతర్జాతీయంగా కంట్రోలు

## సాధ్యంకాకపోదని అట్లీ

లండన్, జూన్ 7: పరమాణుశక్తిని అంతర్జాతీయంగా కంట్రోలు చేయడం సాధ్యపడుతుందనే ఆశాభావాన్ని బ్రిటిషు ప్రధాని అట్లీ, తనకూ, పరమాణుశక్తి కంట్రోలు సంఘానికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల సందర్భంలో వెల్లడించాడు. పరమాణుశక్తి కంట్రోలు విషయానికి సంబంధించిన సమస్యపై అగ్రరాజ్యత్రయ ప్రతినిధుల మధ్య అభిప్రాయభేదాలు ఉన్నమాట నిజమైనప్పటికి యివి అసలు సిద్ధాంతాన్నే త్రోసిపుచ్చవలసిన అవసరం కల్గించేటంత తీవ్రంగా లేవని అట్లీ అన్నాడు.

అట్లీకి, పరమాణు సంఘానికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు యివ్వాళే ప్రచురితమైనాయి.

"వీటో అధికార ప్రయోగానికి అతీతంగా, పరమాణుశక్తిపై అంతర్జాతీయంగా పరిశీలించాలనే సూత్రాన్ని రష్యా ఒప్పుకొన్నది. ఈ అంతర్జాతీయ పరిశీలన సంఘ అధికారాలు చాలా పరిమితంగా ఉండాలని సోవియట్ ప్రతినిధి గ్రోమికో స్పష్టంగా అన్నాడు.

పరమాణుశక్తిపై అంతర్జాతీయంగా కంట్రోలు చేసే విషయమై సమగ్రమైనపథకం అవసరమనే సూత్రాన్ని నేనంగీకరిస్తాను. పరమాణుశక్తితో తయారయ్యే ఆయుధాలను బహిష్కరించడమే కాకుండా దాని ఉపయోగాన్ని పరిశీలించి ఒక క్రమపంథాలో దానిని అభ్యుదయ కార్యక్రమానికి వినియోగాన్ని సూచించేందుకుగా ఒక అంతర్జాతీయ సంస్థను నెలకొల్పడాన్నికూడా యీ పథకం నిర్వర్తించాలి. సక్రమ పంథాలోనే యిది సాధ్యపడుతుంది. ఈ అంతర్జాతీయ కంట్రోలుకు సంబంధించిన వివరాలన్నీ పూర్తిగా తయారయ్యేటంతవరకు వీటో అధికారముగాని పరిమితులపైనా చర్చ జరపడం న్యాయంకాదు. సక్రమమైన మార్గమని అట్లీ సంఘానికి వ్రాసిన లేఖలో తెలియజేశాడు.

# జయపూరు సంస్థానములో మతకలహము

జయపూరు, జూన్ 7: జూన్ 4 తేదీన జయపూరు సంస్థానము నందలి కోట్ కాసిమ్ అను ప్రదేశమున జరిగిన మతకలహములో 17 మంది గాయపడిరని అందులో 8 గురు ఆసుపత్రిలో మరణించిరని జయపూరు సంస్థాన ప్రభుత్వమువారు ప్రకటించుచున్నారు. జూన్ 4 తేదీ రాత్రి పోలీసు అధికారులు ఆ ప్రదేశమునకు వెళ్లిరని, పరిస్థితులు సంపూర్ణముగా అదుపులోనికి వచ్చినవని ప్రకటన తెలుపుచున్నది.

# భారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు

బొంబాయి, జూన్ 7: ఇండియన్ నేషనల్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు కార్యదర్శి కే. కే. దేశాయి తాత్కాలిక కార్యవర్గ సమావేశము ఢిల్లీలో జూన్ 15 తేదీన జరుగుతుందని ప్రకటిస్తున్నాడు.

# సోవియట్ వ్యతిరేక సంస్థ అవసరం

## లూయీ ఫిషర్ ఉద్ఘాటన

న్యూయార్కు, జూను 7: హంగేరీ విషయంలో మనం ఇప్పుడేమీ చెయ్యలేము. అది సోవియటు రష్యాకు దాదాపు బానిస అయిపోయింది. రష్యా హంగేరీని రాజకీయంగా స్వాధీనంలో యుంచుకుంటుందని మనకు 1945 లోనే నిశ్చయమైంది. రష్యాను తదితర ప్రపంచంనుంచి ఒక గోడకట్టుకుని విడిపోయింది. ఆ గోడకు వేసి మన తలలు బద్దలు కొట్టుకునేకన్న వెంటనే మనం ఉత్సాహంలో సోవియట్ వ్యతిరేక ప్రపంచాన్నంతటినీ ఏకముఖంగా సమాయత్తపరచడం అవసరం ఎంతో చనీయమైనప్పటికి ప్రపంచం ఈనాడు రెండుభాగాలుగా చీలిపోయిందని మనం గుర్తించక తప్పదు. ఏకప్రపంచం కావాలని కబుర్లు చెప్పడంవల్ల ప్రయోజనమేమీ లేదు," అని లూయీ ఫిషర్ అంటున్నాడు.

# ట్రూమన్ సిద్ధాంతాన్ని నేను బలపర్చను

## హెన్రీవాలెస్ ప్రకటన

న్యూయార్కు, జూన్ 7: "సోవియట్ రష్యాను ప్రతిఘటించ సంసిద్ధమైన ఏ అభివృద్ధి నిరోధక రాజ్యానికైనా అమెరికా సహాయపడుతుందనడమే ట్రూమన్ అధ్యక్షుని ఆర్థిక సహాయ సిద్ధాంతంయొక్క తాత్పర్యం. ట్రూమన్ సిద్ధాంతాన్ని నేను బలపర్చను" అని యునైటెడ్ స్టేట్సు మాజీ ఉపాధ్యక్షుడు హెన్రీ వాలెస్ స్పష్టంగా ప్రకటించాడు.

ఆమెరికా ప్రజాస్వామిక పక్షాన్ని లిబరల్ పక్షంగా మార్చడానికి తన శాయిశక్తులా ప్రయత్నించేస్తున్నానని, యిది సఫలీకృతమైతే తాను ప్రజాస్వామిక పక్షీయుడుగా యిక ఉండనని వాలెస్ వెల్లడించాడు.

# అవసరమైతే వీట్‌నాం సమస్యను సమష్టిరాజ్య సమితికి ప్రతిపాదిస్తాం

డాII హోచిమిన్హ్ ప్రకటన

సెయిగాన్, జూన్ 7: "బర్మా, భారతదేశాలపట్ల తన విధానాన్ని స్పష్టీకరిస్తూ, బ్రిటన్ యే విధంగా ప్రకటన చేసిందో, అలాగే ఇండోచైనా పట్ల ఫ్రెంచి ప్రభుత్వంగూడా స్పష్టంగా ప్రకటనచేస్తేనే, ఫ్రెంచి, ఇండోచైనాలమధ్య రాయబారాలు మళ్లీ ప్రారంభమయ్యే అవకాశం ఉంటుంది" అని వీట్‌నాం రిపబ్లిక్ అధ్యక్షుడు డాII హోచిమిన్హ ప్రకటించాడు.

"వీట్‌నాంసమస్యకేవలం ఫ్రెంచి ప్రభుత్వ గృహసమస్యగాదు. అవసరమైతే వీట్‌నాం సమస్యను సమష్టికి రాజ్యసమితి ప్రతిపాదిస్తాం.

వీట్‌నాంసమస్యపట్ల అగ్రరాజ్యాల వైఖరిని వివరీకరిస్తు హూచిమిన్హ యిలా అన్నాడు.

చైనామాపట్ల సోదరభావంతో ప్రవర్తిస్తుంది. బ్రిటన్ మిత్రుడివలె ఉందిగాని పరిస్థితిని మాత్రం తటస్థంగా ఊరుకొన్నది.

"వీట్‌నాం జాతీయైక్యతను, స్వాతంత్ర్యాన్ని గుర్తించాలనే మేము కోరుతున్నది. జాతీయైక్యతకంటే, కొచ్చిన్ చైనా, అన్నాం టాంకిన్ రాష్ట్రాలను కలిపి ఒక భూభాగంగా చేస్తూ యూనిటరీ ప్రభుత్వపద్ధతిపైన, యీ మూడింటిలో ప్రతిరాష్ట్రానికి సహాయం పరిపాలనాధికార ప్రతిపత్తిని కల్పించడం. ఈ మూడు స్వయంపరిపాలక రాష్ట్రాలపైన ఒక కేంద్రప్రభుత్వాన్ని నెలకొల్పడం అన్యులప్రమేయం లేకుండా తమ వ్యవహారాలను తామే దిద్దుకోవడం యిదే వీట్‌నామీయులు కోరే స్వాతంత్ర్యానికి అర్థం. కొచ్చిన్‌చైనాను మినహాయించి అన్నాం టాంకిన్ రాష్ట్రాలకు సమష్టి ప్రభుత్వాన్నేర్పర్చడాన్ని వీట్‌నామీయులు అంగీకరించారు. ... ద్వారా అవసరమైతే కొచ్చిన్‌చైనా భవితవ్యాన్ని తేల్చవచ్చు.

తనలో ... కొచ్చిన్‌చైనాలో రష్యాను రప్పించదలచుకుంటున్నదని ఫ్రెంచిఅధికారులు చెప్పేమాటను హోచిమిన్హ ఖండించాడు. 1919 పూర్వం సోవియట్ రష్యా పుట్టనేలేదు గాని వీట్‌నామీయులపై ఫ్రెంచి అధిపత్యం పుట్టి యిప్పటికి 80 ఏండ్లైయింది" అని హోచిమిన్హ అన్నాడు.

# ముక్దెన్‌లో మార్షల్ లా?

హాంకాంగ్, జూన్ 7: ముక్దెన్‌ను తిరిగి వశపర్చుకోడానికి క్వాంటుంగ్ రాష్ట్రంలో చైనా ప్రభుత్వ ప్రతిఘటన అభివృద్ధి అవుతున్న కాలమే యిప్పుడీ ... కాలనీలో మార్షల్ లా అమలు పర్చబడేటట్టు వదంతులు కొంటన్లో బాగా వినిపించాయి.

# ఇండోనీషియాలో తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వస్థాపన

## డచ్చి ప్రతిపాదనలకు ఇండోనీషియా రిపబ్లిక్ ఆమోదం

### పత్రికా విలేఖరుల సమావేశంలో షరీరు ప్రకటన

జోగ్జాకర్తా, జూన్ 7: ఫెడరల్ రాజ్యాంగవ్యవస్థ నిర్మాణం పూర్తియై "యునైటెడ్ స్టేట్సు ఆఫ్ ఇండోనీషియా" యేర్పడేలోగా ఉన్న యీమధ్యకాలంలో ఇండోనీషియా అంతటికీ ఒక ఫెడరల్ తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించాలంటూ డచ్చిప్రభుత్వం సూచించిన ప్రతిపాదనలను ఇండోనీషియా రిపబ్లిక్ ఆమోదించింది. పూర్వపు డచ్చి తూర్పు ఇండియాదీవుల పరిపాలనను పునర్నిర్మించి వాటిపై అఖిలఇండోనీషియా ప్రభుత్వాన్ని పత్యాన్ని నెలకొల్పడానికిగూడా రిపబ్లిక్ మంత్రివర్గం అంగీకరించింది" అని ఇండోనీషియా రిపబ్లిక్ ప్రధాని డా॥ సుటాన్ షరీరు మొన్న శుక్రవారంనాడు జరిగిన పత్రికావిలేఖరుల సమావేశంలో వెల్లడించారు.

"ఇండోనీషియాలో తాత్కాలిక జాతీయప్రభుత్వనిర్మాణానికి సంబంధించిన డచ్చిపథకం రిపబ్లిక్ ప్రభుత్వానికి అంగీకారయోగ్యంగానే ఉన్నది. ఇప్పటినుంచి ఫెడరల్ రాజ్యాంగవ్యవస్థా నిర్మాణం పూర్తియై యునైటెడ్ స్టేట్సు ఆఫ్ ఇండోనీషియా యేర్పడేటంతవరకు ఉన్న యీ అంతరాన్ని తేలికగా సమన్వయించడానికి యీ డచ్చి ప్రతిపాదనలు బాగా ఉపయోగపడతాయి. 1949 సం॥ రంలో 'యునైటెడ్ స్టేట్సు ఆఫ్ ఇండోనీషియా' యేర్పడే యీలోగా ఏదో ఒకరూపంలో అఖిలఇండోనీషియా జాతీయప్రభుత్వనిర్మాణానికి ఇండోనీషియా ప్రభుత్వం సమ్మతిస్తుంది. ఇండోనీషియా ఆర్థిక రాజకీయసమస్యల పరిష్కారమార్గాన్ని సూచిస్తూ 14 రోజుల గడువిచ్చి డచ్చిప్రభుత్వం ప్రతిపాదించిన పంచసూత్ర ప్రణాళికకు, ఇండోనీషియా ప్రభుత్వం లింగ్డజటి ఒడంబడిక సూత్రాల ప్రాతిపదికపైన ఒక సమాధానాన్ని తయారుచేస్తోంది. అఖిల ఇండోనీషియా తాత్కాలిక జాతీయప్రభుత్వ నిర్మాణానికి సంబంధించిన వివరాలను రిపబ్లిక్ తన సమాధానంలో పొందుపరుస్తుంది."

రిపబ్లిక్ ప్రభుత్వం ఆశించిన విధంగా యీ తాత్కాలిక ఫెడరల్ జాతీయప్రభుత్వం యేర్పడితే, యిప్పుడు క్లిష్టతరంగా ఉన్న అనేక ఆర్థికసమస్యలు తేలికగా పరిష్కరింపబడతాయి. ఈ మధ్యకాలంలో భారతదేశంలో యేర్పడ్డ తాత్కాలిక జాతీయ ప్రభుత్వంవంటి ప్రభుత్వంగాని లేక, శాసననిర్మాణాధికారం కలిగి ముగ్గురు సభ్యులతో గూడిన కార్యనిర్వాహక సంఘంగాని యేర్పాటైతే సముచితంగా ఉండగలదని రిపబ్లిక్ ప్రభుత్వం భావిస్తోంది" అని షరీరు ప్రకటించాడు.

"సహజంగా ప్రభుత్వానికుండే కార్యనిర్వహణాధికారాలన్నీ గలిగిన వాస్తవిక జాతీయప్రభుత్వాన్నే మేము కాంక్షిస్తున్నాం. స్వాభావికంగా గవర్నరు జనరలుకు కొన్ని కార్యనిర్వహణాధికారాలుంటాయన్నమాట యథార్థమే. కాని ఆ అధికారాలు చాలా పరిమితంగా చేయబడాలనే మేము వాంఛించేది. ఒకవేళ గవర్నరు జనరల్ జోక్యం కల్గించుకోవలసిన పరిస్థితులు దేశంలో యేర్పడ్డప్పటికీ, వెనుకటి కార్యనిర్వహణాధికారాలను ఆయన చలాయించగూడదని మా అభిప్రాయం.

సంప్రదింపులన్నీ విఫలమై గత్యంతరం లేని పరిస్థితి యేర్పడ్డప్పుడే, ఇండోనీషియా సమస్యా పరిష్కారానికి విదేశాల మధ్యవర్తిత్వాన్ని మేము అర్థించడం సంభవిస్తుంది ఏమైనప్పటికీ మాశాయశక్తులా కృషిచేసి ఉపద్రవకరపరిస్థితి సంభవించకుండా నివారించడానికి ప్రయత్నిస్తాం" అని షరీరు ఉద్ఘాటించాడు.

డచ్చి ప్రతిపాదనలకు రిపబ్లిక్ ప్రభుత్వం అభిప్రాయాన్ని తెల్పడానికి డచ్చి ప్రభుత్వం నిర్ణయించి 14 రోజుల గడువు వచ్చే బుధవారంతో అంతమౌతుంది. డచ్చి ప్రతిపాదనలకు ఇండోనీషియా రిపబ్లిక్ ప్రభుత్వానికొరకు తన సమాధానాన్ని రేపు ఆదివారంనాడో లేక సోమవారంనాడో, గవర్నర్ వాన్‌మూక్‌కు అందచేస్తానని అనుకొంటున్నారు.

ఇంకా, పదిరోజులదాకా డాక్టర్ షరీరు బటేవియా వెళ్ళకపోవచ్చునని అనుకొంటున్నారు. పశ్చిమజావాలో ప్రత్యేకంగా పర్యటన చేయడానికి యీ యన యేర్పాటు చేసికొన్నాడు.

# సూర్యరశ్మితో సముద్రజలం మార్పు

## ఫ్రెంచి శాస్త్రజ్ఞుని పథకం

కరాచీ, జూన్ 7: సూర్యకిరణాల నుపయోగించి సముద్రజలాన్ని మంచినీరుగా మార్చటానికి, ఆ జలంతో భూమి ఎడారిని సాగుచేయడానికి ఒక నూతన పథకాన్ని పారిస్‌లోని అక్టినాలజీ (సూర్యకిరణ శాస్త్రం) ఇన్‌స్టిట్యూటు డైరక్టరు డీన్ సెడ్‌హన్, కనిపెట్టాడు. జాం, సాహెబ్ ఆహ్వానంమీద నవనగర్ వెళుతూ ఇక్కడ ఆగినప్పుడు ఈ విధంగా చాన్ని వివరించాడు:

'సూర్యరశ్మిలోని శక్తిని వుపయోగించి పరమాణు శక్తికి సంబంధించిన మోస్తరుగా ఎలక్ట్రాన్లను సంపాదించవచ్చును. యీ ఎలక్ట్రాన్లవల్ల 'సోలారియం' అనే పరికరంతో సముద్రజలాన్ని మరిగించి మంచినీటిని బట్టి పెట్టవచ్చును. భారతదేశంలో సూర్యరశ్మి విపరీతంగా వున్నది కనుక ఇది సులభసాధ్యమౌతుంది. ఆ నీటిని పెద్ద పంపులద్వారా దేశంలోకి పంపవచ్చును." కతియవాడ్, రాజపుటానా, థార్ ప్రాంతంలో ఉపయోగించుకునే నిమిత్తం పరిశోధనలు జరపడానికి ఈ శాస్త్రజ్ఞునికి నవనగర్ ప్రభువు జాంసాహేబ్ తోడ్పడుతున్నాడు.

# సింధు హిందువుల పథకము

న్యూఢిల్లీ, జూన్ 6: సింధురాష్ట్రీయ హిందూమహాసభా రాయబారులు మహారాజ్ హరిద్రాజ్ శర్మ, మహారాజ్ ద్వారకప్రసాద్ శర్మ, చంచల్‌దాస్ ఆర్య, ధర్మదాస్ పస్సుమల్ దయాల్‌సింగ్ బేడి, అనే అయిగురున్నూ ఢిల్లీవచ్చి యీ వద్యాగత హిందూమహాసభా నాయకులను కలసుకొన్నారు. సింధురాష్ట్రములో ముస్లిములీగు మంత్రివర్గమువారి ప్రభుత్వము హిందువులు ఏ ఏ విధముల బాధలం పడుతూ ఉందీ వివరించినారు. సింధు హిందువులు పదిహేను లక్షల మందికిన్నీ ప్రత్యేక మాతృభూమిని గురించిన పథకాన్ని తెలియచేసినారు. ఈ రాయబారులు రాజప్రతినిధినీ, గాంధీమహాత్ముణ్ణి కలుసుకొని యీ పథకాన్ని గురించి చర్చించ దలచుకున్నారు.

సరిహద్దు రాష్ట్రములో శరణాగతుల తరఫున గణపతిరాయ్ నాయకత్వముతో మరి ఒక రాయబారము వారు వచ్చి హిందూ మహాసభా నాయకులను కలుసుకొని వారి దుఃఖాలను బాధలను చెప్పుకొన్నారు. హిందూమహాసభా నాయకులు వారికి సంపూర్ణముగా సాయంచేస్తామని చెప్పినారు.

# జిన్నాగారికి అసలు చిక్కులన్నీ ముందున్నవి

### స్టేట్స్‌మన్ పత్రిక వ్యాఖ్య

ఎడింబరో, జూన్ 6: హిందువులకు ముస్లింలకు సమాధానం కుదరనిపక్షంలో, దేశవిభజనకన్నా గత్యంతరంలేదని గాంధీజీకి నిరూపించడమే రాజప్రతినిధి సాధించిన మహాకార్యమని స్కాటిష్‌జాతీయ పత్రికయైన "స్కాట్స్‌మన్" నేడొక సంపాదకీయంలో వ్రాసింది.

"కాబట్టి దీని బాధ్యతఅంతా ఇప్పుడు జిన్నాగారి నెత్తిమీదనే పడింది. ఇకనైనా బ్రిటిషువారితో ప్రమేయం లేకుండా వివిధపక్షాలు కలిసి పరిష్కార వివరాలు తేల్చుకోవలెనని, గాంధీజీ కావించిన సూచనను ముస్లింలీగు తిరస్కరించేపక్షంలో, జిన్నాగారిమీదఇదివరకటికంటెకూడా నిశితమైన విమర్శనలు రాక తప్పదు. జిన్నాగారిప్పుడు ఇంతకాలము పోట్లాడి సంపాదించుకున్న పాకీస్తాన్‌ను జారవిడుస్తారనుకోవడం పొరపాటు. ఐతే, జిన్నాగారు ఇంతకాలము చేసిన ప్రయత్నంఅంతా ఒకఎత్తు, ఇకముందు ఎదుర్కొనవలసిన సమస్యలన్నీ ఒకఎత్తు; అసలు చిక్కులన్నీ ముందే ఉన్నవి."

# బటేవియాలో భారత ప్రభుత్వ రాయబారి

బటేవియా, జూన్ 6: బటేవియాలో తమ రాయబారి నియామకాన్ని గురించి భారతప్రభుత్వం డచ్చిప్రభుత్వానికి నివేదించిందని ఇక్కడి అధికారవర్గాలద్వారా తెలుస్తుంది.

ఇండోనీషియా, భారత ప్రభుత్వాల మధ్య నానాటికి అభివృద్ధి చెందుతున్న సత్సంబంధాల ప్రాధాన్యతను గుర్తించి భారతప్రభుత్వ రాయబారి బటేవియాలో నియమింపబడడాన్ని డచ్చి ప్రభుత్వం బాగా ప్రశంసించిందని తెలుస్తోంది.

డచ్చి, భారతప్రభుత్వాలు తమ తమ రాయబారులను ఉభయదేశాలలో నియమించుకోడానికి అంగీకరించడాన్నిబట్టి, డచ్చి సామ్రాజ్యంలోని వివిధ ప్రాంతాలలో భారతీయరాయబారులు నియమింపబడవచ్చునని ఊహించవచ్చు.

# ఫ్రెంచి ఇండియాలో ప్రభుత్వం ప్రజలదే

## త్వరలో రాజ్యాంగ సంస్కరణలు

### గవర్నరు అభిభాషణ

పుదుచ్చేరి, జూన్ 6: ఫ్రెంచి ఇండియా రాజ్యాంగంలో జరగబోతున్న గొప్ప మార్పులను గురించి మాట్లాడుతూ, "ఫ్రెంచి ఇండియాలోని అధికారం అక్కడి ప్రజలకే చెందుతుంది" అని ఫ్రెంచి ఇండియా గవర్నరు సి. ఎఫ్. బారో అన్నాడు. ఢిల్లీలో తాను భారత నాయకులను కలుసుకున్న దానిపై ప్రసంగిస్తూ అటువంటి గొప్ప వ్యక్తులను కలుసుకోగలిగినందుకు ఆనందంగావున్నది అన్నాడు.

"పంకిక స్నేహంతో విజ్ఞానాన్ని వృద్ధి చేయటానికి మేము అనుసరించే పథకాలను తెలియజేశాను. ఫ్రాన్సు భారత జాతియొక్క స్నేహాన్ని అన్నిటికన్నా ఎక్కువగా కోరుతుందనీ పుదుచ్చేరి ఈ రెండు దేశాలమధ్య పంథానంగా వుండ వాంఛిస్తున్నదనీ తెలియజేశాను' అన్నాడు.

# కంబం హైస్కూలు

కర్నూలు, మే 31: ప్రయివేటుగా చదివి 1, 2, 3 ఫారములలో చేరుటకు వచ్చిన దాదాపు 400 మంది విద్యార్థులకు కంభం హైస్కూలులో ప్రవేశము కల్పించుటకుగాను నూతన సెక్షనులు ఏర్పాటు చేయవలెనని కర్నూలు జిల్లా బోర్డు స్పెషలు ఆఫీసరు ఆర్. రామచంద్రారెడ్డిగారితో చేగిరెడ్డి బాలిగెడ్డిగారు అల్లూరు సుబ్బారెడ్డిగారు, అజీజు బేగుగారు, డా॥ వేణుగోపాలరెడ్డిగారు ఒక రాయబారవర్గముగా వెళ్లి చెప్పిరి. ప్రస్తుతం హైస్కూలులో చదువుచున్న 700 మంది విద్యార్థులకు స్థలం చాలడం లేదు. అందువల్ల షిఫ్టుపద్ధతి అమలుపరచినచో కొత్తవారికి అవకాశం కల్పించవచ్చునని. కావలసిన సదుపాయములు చేయబడునని స్పెషలు ఆఫీసరుగారు రాయబారవర్గమువారితో చెప్పిరి.

# రేపల్లె

రేపల్లె, జూను 6: రేపల్లెతాలూకాలో కూచినపూడి పిర్కాలోని గ్రామాలలో త్రాగుటకు మంచినీరులేక పశువులు మనుష్యులు అల్లాడుచున్నారు. ప్రతిసంవత్సరం మార్చి ఆఖరులో చెరువులకు నీరువస్తూయుండేవారు ఈసంవత్సరం అలా జరిగియుండలేదు. దానికితోడు ఇంతవరకు వర్షాలులేవు. గ్రామస్థులు నాలుగైదుమైళ్లు నడచివెళ్లి నీళ్లుతెచ్చుకోవలసిన స్థితిలోయున్నారు. ప్రభుత్వంవారు వెంటనే నీరుసప్లయి అవునట్లు చేయవలసియున్నదని రేపల్లెతాలూకా కాంగ్రెసు అధ్యక్షులు యన్. యస్. ఆర్ కృష్ణయ్యగారు వ్రాయుచున్నారు.

# రాయచోటి

రాయచోటితాలూకాలోని రెడ్లందరు రామాపురంవద్ద జూను 1 తేదిని సమావేశమై రెడ్డిజనసంఘమును స్థాపించిరి. వీ. నాగిరెడ్డిగారిని అధ్యక్షులుగాను డా॥ తిప్పారెడ్డిగారిని కార్యదర్శిగాను ఎన్నుకొనిరి.

# వడదెబ్బవల్ల మరణం

నిడప్రోలు, జూన్ 4: అమృతలూరు వాస్తవ్యులు కొమ్మినేని నరసింహంగారు (60 సం॥) మోదుకూరునుంచి అప్పికట్లకు పోవుచుండగా వడదెబ్బతగిలి చనిపోయిరి. మునిపల్లె సమీపమున ఒక మనిషి ఎండదెబ్బకు చచ్చిపోయి పొలములో పడియుండెను.

### కొరలిస్తేనే బియ్యం

బళ్లారిజిల్లా ఆలూరుతాలూకు చేలిహరాపురంలో గ్రామంలో కోఆపరేటివు స్టోరులో రేషను సరిగా యివ్వడంలేదు. రేషనుకార్డులమీద యస్. పి. అని వ్రాసియిచ్చారు. ఈకార్డులున్నవారు బియ్యము కావలెనంటే అందుకు బదులుగా కొర్రలను సమర్పించాలి. వారు బియ్యం ఎంతయిస్తారో అన్ని కొర్రలను స్టోర్సుకు సమర్పించాలి. భూములులేనివారికి చాలా యిబ్బందిగా ఉన్నది ఈవిషయము కలెక్టరుకు కూడా నివేదించవలెనైనదని విలేజి కాంగ్రెసుకమిటీ సభ్యులొకరు వ్రాయుచున్నారు.

### దొంగ నల్లమందు

చికాకోల్, జూన్ 3: సుమారు 330 తులాల నల్లమందు ఉన్న మూటను నేడు చికాకోల్ ఎక్సైజు ఇన్‌స్పెక్టరుగారు పట్టుకొన్నారు. అది ఎవరివద్దనుండున్నదో వారినిపట్టుకొని రిమాండులో ఉంచిరి.

బెజవాడ, జూన్ 4: వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయం సంఘ సభ్యుల సమావేశం మొన్న జరిగినది. అధ్యక్షపట్టిక కార్యదర్శి నివేదించిన సిమ్మట కొత్త కార్యవర్గము ఎన్నుకోబడెను.

# ప్రభుత్వోద్యోగుల వేతనాలు

## కేంద్రప్రభుత్వ నివేదికను మద్రాసు అమలుజరపక పోవచ్చును

చెన్నపురి, జూన్ 7: ప్రభుత్వోద్యోగుల వేతనాలనుగురించిగాని, కరువుభత్యాలనుగురించిగాని కేంద్రప్రభుత్వ విచారణసంఘ నివేదికలోని ప్రతిపాదనలను మద్రాసు ప్రభుత్వం అమలుజరపకపోవచ్చుననీ, తరువాత ఎట్లున్నప్పటికీ ప్రస్తుతం అమలుజరపబడదనీ మద్రాసు ఆర్థికశాఖామంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు నేడు పత్రికా విలేఖరులకు తెలియపరిచిరి.

కరువుభత్యాలను కేంద్రప్రభుత్వ నివేదిక ననుసరించి అమలుజరిపే పక్షంలో మద్రాసు ప్రభుత్వం దాదాపు రు 8 కోట్లు అదనంగా వెచ్చించవలసి వుంటుందనీ, ప్రస్తుత రాష్ట్ర ఆర్థిక పరిస్థితిలో అంత ఖర్చు భరించరానిదనీ చెప్పుచూ మంత్రిగారు మద్రాసులో ఎన్నడూ కేంద్ర ప్రభుత్వ వేతన విధానం అనుసరించబడలేదని తెల్పిరి. అదీగాక ఇటీవలనే మద్రాసు ప్రభుత్వం ప్రభుత్వోద్యోగుల వేతనాలను, కరువుభత్యాలను హెచ్చించినది. అట్లు హెచ్చించుటలో కేంద్రప్రభుత్వ విచారణ సంఘం చేయబోవు ప్రతిపాదనలతో దాదాపు సమానంగాఉండునట్లు మద్రాసు ప్రభుత్వం శ్రద్ధ వహించినది. కేంద్ర ప్రభుత్వ నివేదిక వెలువడినప్పుడు తిరిగి వేతనములను సవరింప నవసరం లేదని మద్రాసు ప్రభుత్వం అప్పుడే ప్రకటించినది.

ప్రస్తుత మద్రాసు ప్రభుత్వం ఉద్యోగుల కరువుభత్యాలక్రింద రు 520 లక్షలు వ్యయపరుచుచున్నది. ఇంకనూ పైన రు 8 కోట్లు వ్యయపరచుట అసాధ్యం.

వెయ్యి రూపాయలు, అంతకుమించిన మాసవేతనాలు పొందుతున్న ప్రభుత్వోద్యోగులకు కరువుభత్యముల నిచ్చు విషయంలో మద్రాసు ప్రభుత్వం అభిప్రాయమును కేంద్ర ప్రభుత్వం తెలుసుకొనగోరింది. కేంద్రప్రభుత్వ విచారణసంఘం ఈ ఉద్యోగులకు కరువుభత్యం ఇవ్వవలెనని ప్రతిపాదించనేలేదు. అయినప్పటికీ కేంద్రప్రభుత్వం వారి జీతములలో నూటికి 10 చొ॥ రు 150 కి మించకుండా కరువుభత్యం ఇవ్వగోరుచున్నది ఈ విషయమై జూన్ 30 వరకూ ఏమీ చేయకూడదని మద్రాసు ప్రభుత్వం నిశ్చయించింది. భారతమంత్రివల్ల నియమింపబడిన ఉద్యోగులకు జూన్ 30 వరకూ రు 175-263 కరువుభత్యములను ఇవ్వవలసి యున్నది.

మద్రాసుప్రభుత్వంక్రింద 1,52,800 ఉద్యోగులున్నారు. వీరిలో 295 మంది వెయ్యిరూపాయలకుపైన మాసవేతనములు పొందుచున్నారు. 1200 మంది రు 400 రు 1000 మధ్య మాసవేతనములు పొందుచున్నారు. 5,400 మంది రు 40-రు 200 మధ్యనూ, 78,600 మంది రు 40 కి తక్కువగానూ మాసవేతనాలు పొందుచున్నారు.

రు 400-రు1000 మధ్య మాసవేతనాలు పొందుచున్నవారికి కేంద్రప్రభుత్వం నివేదిక ననుసరించి కరువుభత్యాలను ఇవ్వవలసివచ్చినపక్షంలో, మద్రాసు ప్రభుత్వానికి కొంత ఖర్చుతగ్గుతుంది. కాని నివేదికలోని ప్రతిపాదనలన్నిటినీ అమలుపరచినట్లయితే మొత్తం రు 288 లక్షలు అదనం వెచ్చించవలసివుంటుంది. అంటే మొత్తం రాష్ట్రరివిన్యూలో సగమన్నమాట.

### తపాలా, తంతిఉద్యోగుల అసంతృప్తి

చెన్నపురి, జూన్ 7: కేంద్రప్రభుత్వ వేతన విచారణసంఘ నివేదిక అసంతృప్తికరంగా ఉన్నదని ప్రకటించుచూ, తమ కోర్కెలను సాధించుటకు తగుచర్యతీసుకొనవలసిందని కేంద్రసంఘాలను కోరుచూ మద్రాసురాష్ట్రతపాలా, తంతి ఉద్యోగులసంఘం నిన్నసాయంకాలం శ్రీ వి చక్కరయ్యచెట్టిగారి అధ్యక్షతక్రింద సమావేశమై ఒక తీర్మానం చేసింది.

# సింధు పాఠశాలల్లో ఉర్దూ

## హిందూస్తానీ రద్దు

కరాచీ, జూన్ 4: సింధురాష్ట్ర ముస్లిములీగు మంత్రివర్గం ఇకనుంచి ఆ రాష్ట్రంలో హిందూస్థానికి బదులుగా ప్రాథమిక పాఠశాలలన్నింటిలోనూ ఉర్దూబోధనే జరుగుతుందని ఒక ఉత్తర్వుద్వారా ప్రకటించింది.

ఈ ఉత్తర్వును విద్యామంత్రి పీర్ ఇలాహీ బక్స్, హైదరాబాదు పర్యటన ఇటీవల కావించి వచ్చిన వెంటనే జారీ చేసినట్లు తెలుస్తున్నది. ఆయన ఈ సందర్భంలో ముస్లిం మెజారిటి రాష్ట్రమైన సింధులో ఉర్దూభాషకే ప్రాముఖ్యం ఇవ్వబడుతుందనికూడా అన్నాడు.











Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras